ఓం

# తుకారాము చరిత్రము.



మచిలీపట్టణములోని
"సరస్వతీ నికేతనము" వారిచే
ప్రచురింపఁబడినది.

---

చెన్నపురి:
జ్యోతిష్మతీముద్రాలయంబున
ముద్రితము.

1913

 వెల రు. ౦-౮-౦.

# విజ్ఞాపనము.



ఆంధ్రవాఙ్మయమునందు మహాపురుషుల జీవనచారిత్రము లతిస్వల్పముగ నున్నవి. అందునను భక్తపుంగవుల సచ్చరిత్రము లొకటిరెంటికంటె మిక్కుటముగ లేవని చెప్పినను జెప్పవచ్చును. కావున చేతనైనంతవఱకు భక్తులసచ్చరిత్రములను వ్రాసి యాంధ్రమాత కర్పింపవలయునను సంకల్పమున నేనీగ్రంథమును రచియించితిని. నాకీ సంకల్పమును బ్రసాదించి ఈచరిత్రను బూర్తిచేయించిన జీవనదాతయగు పరాత్పరుని పాదపద్మములకు నీగ్రంథమును సమర్పించుచున్నాను. శ్రీయోగీంద్ర నాథ్ బోసు విరచితమగు తుకారామునిచరిత్రను ముఖ్యావలంబనముగ గైకొని నేనీగ్రంథమును వ్రాసితిని. భాషయందును, జ్ఞానమునందును, బాలప్రాయుఁడనగు నావ్రాతల యందనేక

లోపములుండుననుట నిక్కమని ఆంధ్రమహా జనులకు విన్నవించుకొనుచు నీగ్రంథమునందలి తప్పులను సవరించిన మిత్రులకును, పండితుల కును, వందనము లాచరించుచున్నాను.

ఇట్లు
సుజనవిధేయుఁడు,
గ్రంథకర్త.

# భక్తియోగము.

శ్రీయుత బాబు అశ్వనీకుమారదత్తు ఎం. ఏ., బి. ఎల్., గారిచే రచింపఁబడిన బంగాళ గ్రంథమునకు, భాషాంతరీకరణము. పురుషులు, స్త్రీలు, పిన్నలు పెద్దలు, అను భేదములేకుండ అందఱు పారాయణము చేయఁదగినది. బంగాళదేశములోని విద్యాధికులు, సన్యాసులు, రాజులు, బీదలు, స్త్రీలు, పిరువారనపేల ఎల్లరును భగవద్గీతకు ప్రత్యామ్నాయముగా నీ గ్రంథమును పారాయణ చేయుచున్నారు. ఇట్టి యీపవిత్ర గ్రంథములోని సారమును ఆంధ్రులుగూడ చవిగొనవలెనని కోరి భాషాంతరము చేసితిమి. శైలి సులభమై, మృదుపదలలితమై ఒప్పుచుండును. విద్వత్కవివరేణ్యులగు బ్రహ్మశ్రీ, విద్వాన్, వేదము వేంకటరాయ శాస్త్రిగారివలన పరిష్కరింపఁబడినది. సర్వజనులు పఠింపఁదగిన ఈ గ్రంథము వెల పోస్టేజిగాక రు. ౧-౮-౦. కాలికో బైండు చేయఁబడినది.

# తుకారాము చరిత్రము.

పోస్టేజిగాక వెల రు. ౦-౮-౦

# * శ్రీరామచరిత్రము.

భాగవతములోనిది. శ్రీయుత గాడిచెర్ల హరి సర్వోత్తమరావుగారిచే వ్యాఖ్య వ్రాయఁబడినది.

౧౯౧౩ సం॥ విజ్ఞానచంద్రికా పరిషత్తు పరీక్షకు పఠనీయగ్రంథము.

కాలికోబైండు. 0 8 0

☞ * ఈగ్రంథమును చెన్నపట్టణము, చింతాద్రిపేట 3 రాజగోపాలనాయకవీధిలోనుండు గ్రంథకర్తగారికిగాని, క్రింది విలాసమునకుగాని వ్రాసిన బడయగలరు.

విలాసము:—కార్యనిర్వాహకుఁడు.

సరస్వతీ నికేతనము.

మచిలీపట్టణం.

# ఉపోద్ఘాతము



భారతవర్షము మహాపురుషులకు లీలాక్షే-
త్రము. ప్రతియుగములోను భక్తులు, జ్ఞానులు,
కవులు, రాజ్యతంత్ర నిపుణులు, రాజ్య సంస్థాప-
కులు, మతోద్ధారకులు, మతశాసకులు, జనించి
భారతవర్షమును పవిత్రవంతముగ నొనర్చియు-
న్నారు. ఈమహాపురుషుల ముఖ వినిసృత వా-
క్యామృతప్రవాహములు కృష్ణ, గోదావరి,
తుంగభద్ర, మొదలగు మహానదులవలె భార-
తీయుల హృదయక్షేత్రముల యందుఁ బ్రవహిం-
చుచు, అమృతఫలంబులను ఫలింపఁజేయుచున్నవి.
ఋగ్వేదకాలము మొదలు నేఁటివఱకును గల
సంస్కృత వాఙ్మయమంతయు, ధర్మభావపూరిత-
మై యుండుటయేఁగాక, ఆధునికసాహిత్యము-
లన్నియు, ధర్మభావోద్దీపకములై జాతీయ సా-

హిత్యమునకు కల్పతరువులై యలరారుచున్నవి. హిందీభాషయందు తులసీదాసుని యొక్కయు, వంగభాషయందు రామప్రసాదసేనుని యొక్కయు, అరవభాషయందు తిరువళ్లువర్ యొక్కయు, ఆంధ్రభాషయందు వేమనయోగి బమ్మెర పోతనామాత్యుఁడు త్యాగరాజస్వాముల యొక్కయు, భక్తిరస పూరితముగు కవితతోఁగూడిన పద్యములును కీర్తనలును ఆయా జాతీయులం దఱ కానందమును గలిగింపుచు ప్రేమారాజ్యమునకు ఆకర్షింపుచున్నవి. ఆయా దేశముల యందు జనించి జాతీయతయం దిమిడి యుండి భూతమైయున్న భక్తితత్వము నుద్దీపింపఁజేసిన మహాభక్తులు తమతమ యిష్టదేవతల నుద్దేశించి చేసిన స్తుతి ప్రార్థనలతోఁగూడిన కవిత్వమును, నేఁడు లక్షలకొలఁది మానవులు పాఁడుచు హృదయతాపములఁబాసి, శాంత, దాస్య, స్నేహ, వాత్సల్య, మధుర భావములంజొచ్చుచున్నారు. వంగదేశము మహారాష్ట్రదేశము మొదలగు

దేశములయం దెచ్చటి కేఁగినను, భక్తుల గాన
ములు కర్ణరసాయనము లగుచుండును.

పదునేఁడవశతాబ్దము ప్రారంభమునందు తుకారాముఁడు జన్మించెను. ఈశతాబ్దమునందు ఆర్యావర్తము మహావిప్లవమునకు లోనై యుండెను. ఈశతాబ్దముననే తలిదండ్రులను జెఱసాలయందిడి సోదరులలోఁ గొందఱినిఁ జంపించి ఔరంగజేబు, భారతవర్ష సామ్రాజ్య పీఠము నధిష్ఠించెను. ఈతఁడు ముప్పదికోట్ల హిందువులను మహమ్మదీయమతావలంబకులనుగఁ జేయ నుంకించుచు హిందూ జాతీయ తత్వమునం దినుడి ప్రకోపించు చున్న స్వామిభక్తినే సాధనముగఁ గైకొని మహా ప్రయత్నమున నిమగ్నుఁడై యుండెను. ఈ మహా ప్రయత్నమును జూచినయెడల మానవ జాతియందు హిందూ ధర్మముయొక్క ప్రత్యేక వ్యక్తిత్వము నశించుకాలము సమీపించిన దని తోపవచ్చును.

కాని పరమేశ్వరుని విధానమును గణనచే
యుట దుస్తరము గదా? మహమ్మదీయుల విపుల
ప్రయత్న సంఘాతము వలన భారతీయుల జాతీయ
శక్తి విజృంభించి మహమ్మదీయ ధర్మ విప్లవమును
నడంచుటయేఁ గాక మహమ్మదీయ రాజ్యవినాశ
నము తోడ నీవిజృంభణము పూర్తియయ్యెను.
ఈమహావిప్లవము నెదుర్కొని సనాతన హిం
దూధర్మమును పునర్జీవింపఁజేసి, మహమ్మదీయు
లను రాజ్యభ్రష్టులనుగ నొనర్చి, భారతవర్ష
సామ్రాజ్య సింహాసన మాక్రమించి మానవచరి
త్రయం దత్యద్భుత ప్రదర్శనమును ప్రదర్శించిన
వారలు మహారాష్ట్రులు. భక్తి, జ్ఞాన, కర్మల,
యొక్క సమ్మేళనశక్తియే మహారాష్ట్రుల నపూ
ర్వ గౌరవాన్వితులుగ నొనర్చెను. దాదాపుగ
పదునేఁడవశతాబ్దము మధ్యభాగమునందు మహా
బలశౌర్యధుర్యుఁడగు శివాజియు, జ్ఞానసంపన్నుఁ
డగు రామదాసస్వామియు, భక్తాగ్రగణ్యుఁడగు
తుకారామును తమతమధర్మములను నిర్వహించు

చుండెను. సమగ్రభారతవర్షమునం దంతటను, నవశక్తిని వ్యాపింపఁజేయుటకుఁ గాను భగవానుఁ డీమువ్వురను సృజియించెనని చెప్పినను జెప్ప నొప్పు. వ్యక్తిగత జీవనమునకు వలెనే, జాతిగత జీవనమున కప్పుడప్పుడు సుయోగము సంభవించు చుండును. అప్పుడు జాతియొక్క ప్రతివిషయ మందును కల్యాణోన్నతి లక్షితంబగును. మహా బలుఁడగు ఛత్రపతి శివాజీ మహారాజుయొక్క మహారాష్ట్ర సైనికగణము దిఙ్మండలములు ప్రతి ధ్వనించు నట్లు రణవిజయ నినాదములు చేయు నప్పుడు, తుకారామునిచే విరచితమైన అభంగ ములు లక్షలకొలఁది మహారాష్ట్రులను దేశభక్తి పూరితులుగ నొనర్చుచుండెను.

ఛత్రపతి శివాజీ బాహుబలముననుు, బుద్ధికౌ శలముననుు, మహారాష్ట్రసామ్రాజ్యమును స్థా పించెనని కొందఱు చరిత్రకారులు వ్రాసినవ్రాఁ తలు, భ్రమ ప్రమాదములకు లోనై యున్నవని చెప్పనగును. ఒక్క బాహుబలము మీఁదనే

నిర్ధారపడి జాతీయజీవనమును ప్రతిష్ఠాపించుట అసంభవము. మహమ్మదీయులు కొన్ని వందల సంవత్సరముల లోపల అట్లాంటిక్ మహాసముద్రము వఱకుఁగల దేశమునందంతటను తమరాజ్యమును వ్యాపింపఁజేసిరి. కాని ఈ రాజ్యవ్యాపకమునకు బాహుబలమే కారణముగాదు. ధర్మబలముననే బలవంతులై రాజ్యవిస్తారమును జేయఁగలిగిరి. ఇదేవిధముగ మహారాష్ట్రులు ధర్మబలమున బలవంతులై సనాతన హిందూ ధర్మము నుద్ధరించి భారతవర్షమునందు నూతన శకమునకు కర్తలైరి.



# తుకారాము చరిత్రము

(౦)

## మొదటి ప్రకరణము

మహారాష్ట్ర సామ్రాజ్య లక్ష్మికి మందిరంబు నాఁబరఁగిన పూనాపట్టణమునకు వాయవ్యమూల యం దెనిమిది క్రోసుల దూరమందుంను, ఇంద్రా ణీనదీ తటమున దేహూయను గ్రామము గలదు. ఆగ్రామమునందు "మోరే" యను ఉపాధిగల ప్రాచీన మరాటీ కుటుంబము నివసించుచుండెను. వీరు శూద్రులు. వాణిజ్యమే వృత్తిగాఁగల నీవంశీకులు ఆదేశములోని యుచ్చపదస్థులగు మరాటీవారితోఁడ సంబంధ బాంధవ్యములు గలిగి గణనకెక్కి యుండిరి. ఈ మోరే వంశము నందు క్రీ॥ ౧౬౦౮ - ౧౬౦౯ వ వత్సరముల మధ్య సహిష్ణుతాధురంధరుఁడును, స్వార్థత్యా

గియు, నిష్ఠాగరిష్ఠుఁడును, భక్తశిఖామణియు నగు తుకారాము జనించెను.

ఈ వంశీకుల హృదయ సీమలయందు నాటు కొనిన భక్తిబీజము మొలకెత్తి క్రమానుగతముగ తుకారాముని తలిదండ్రుల జీవితములందు వృక్షమై యీయన జీవనము నందు సంపూర్ణ ఫల ప్రదంబయ్యెను. పురుషానుక్రమముగ భక్తి వైరాగ్యముల కాకరమైన వంశములు మిక్కిలి యరుదని చెప్పుట యతిశయోక్తి కాదు. కాని యీతని వంశమునందలి సప్తమ పూర్వపురుషుఁడగు విశ్వంభరుఁడు వ్యాపారము చేయుచుండెను. న్యాయముగ ధనమార్జించుచు దొరకిన దానితోఁ దృప్తినొందుచు భక్తులు, జ్ఞానులు, సన్యాసులు, మొదలగు సాధుపురుషుల కాహార పానీయము లిచ్చుచు సన్మార్గమున కాలము గడుపుచుండెను. ఈయన కాల నియమము లేక యెల్లప్పుడును హరినామస్మరణ చేయుచుండెడి వాఁడు. పండరిపురనాధుఁడు వీరి కులదైవము. ధనవ్యయమగునని

గాని దొంగల భయమనిగాని పథశ్రమయని గాని తలంపక బహుదూరస్థితంబగు పండరిపురమునకు కాలినడక నేగి, ప్రతియేకాదశి నాఁడును ఈయన విఠోబాదేవుని దర్శించి, పూజార్చనలను జేసి వచ్చుచుండును. ఈ విధముగ పదునాలుసారులు పండరి పురనాథుని సేవించిన పిమ్మట నొకానొక దినమున స్వప్నమునం దాయన ప్రత్యక్షుఁడై చెప్పినవిధముగా దేహూగ్రామ సమీపమందలి మామిడితోఁటలో విఠోబా (విష్ణు) విగ్రహము దొరకెను. ఈ విగ్రహమునకు ఇంద్రాణీ నదీ తీరమున దేవాలయమును గట్టించి అందు భక్తి పరవశుఁడై పూజార్చనలను జేయుచుండెను. విశ్వంభరుని భార్య ఆమాబాయి భక్తిసేవా తత్పరయై యుండెను. ఈ దంపతుల జీవనమునందే భక్తిబీజము మొలకెత్తెను. ఈ దంపతులకు తుకారాము సప్తమ పురుషుఁడు. ఈ భక్తావతంసుని తండ్రిపేరు బొల్హోబా. చాల దినములనుండి యీవంశమునందు వచ్చుచున్న

సద్గుణము లీయనయందు సంపూర్ణముగ వికసిం
చెను. భక్తిపరాయణుఁడును సేవానిరతుఁడు
నగు బోల్హోబా నిరతాన్నదాతయై సమస్త
జీవులయందును దయయు శాంతమును గలిగి
ప్రవర్తించుచు కోపతాపము లెఱుంగక అనృతము
నంకఁబోక సన్మార్గపథమున నడుచుచుండెను.
తుకారాముని తల్లి కనకాబాయి పతిభక్తి పరా
యణయు, సచ్చరిత్రయు, భక్తురాలునై యుం
డెను.

చాలకాలము వఱకీదంపతులకు సంతానము
లేకుండెను. కాని వీరు సంతానాభిలాషతో
విఠోబా దేవుని సేవఁజేయుచుండిరి. ఈ విధముగ
కొంతకాలము జరిగిన తరువాత వయసుచెల్లిన
కనకాబాయికి పుత్రుఁ డుదయించెను. ఆతనికి
"శాజీ" యని నామకరణ మొనర్చిరి. భక్తాగ్రే
సరుఁడగు తుకారాముఁ డీదంపతులకు ద్వితీయ
పుత్రుఁడు. ఈతని గర్భమున ధరించినప్పుడు, కనకా
బాయి విరాగముతో నొంటరిగ తిరుగుచు విరా

మము లేక విఠోబా నామస్మరణము సేయుచుండె
నని వదంతి గలదు. గర్భిణియైయున్న స్త్రీ యొక్క
మానసికావస్థ యామె భావిసంతానము యొక్క
చరిత్రను సూచించుననియే. ఈ వదంతి యొక్క
అభిప్రాయమని చెప్పనొప్పును. తుకారాముని
తరువాత నింకొక కుమారుడును కొమార్తె
యుఁ గనకాబాయికి జనించిరి. పుత్రికాపుత్రు
లును ధన ధాన్య సమృద్ధియుఁ గలిగి యాదంప
తులు సంసార ధర్మములందు చరితార్థులైరి. సిరి
సంపదలు గలిగినప్పుడు పరమేశ్వరుని మఱచు
చుండువారిని సాధారణముగఁ జూచుచుందుము.
కాని ఈదంపతులు సంసార సుఖములలో మునిఁగి
యుండియు సంసారసుఖప్రదాతను మఱచిన
వారలు గారు. వీరి గృహమునం దనుదినమును
హరిభజనయును భగవత్ప్రసంగమును జరుగు
చుండెను. ఇందువలన తుకారాముఁడు భక్తు
లతోఁగూడి సంకీర్తనఁ జేయుచు నృత్యముఁ జేయు
చుండుటవలన బాల్యముననే ఈయన హృదయ

క్షేత్రములో భక్తిబీజములు మొలకలెత్త నారం భించెను. యుక్తవయస్కురాఁగానే బోల్హోబా ఆడంబరముగ పుత్రికాపుత్రులకు వివాహములొ నర్చెను.

పెద్దకుమారునకు సంసార మప్పగించి మిగత జీవిత కాలమును శాంతముగఁ గడప వలయునని బోల్హోబా తలంచెను. కాని బాల్యమునుండియు సంసార సుఖములయం దనురాగములేని శాజీ సంసార నిర్వహణ భార గ్రహణమున కంగీకరింప కుండుట వలన సంసార నిర్వహణభారము మన కథానాయకుని స్కంధముపైఁ బడెను. తుకా రాముఁడు బాలుఁడైనను పితృాజ్ఞోల్లంఘనము చే యఁజాలక సంసార నిర్వహణ కార్యమునకుఁ బూ నుకొనెను. ఇప్పటికి తుకారాముని వయస్సు పదు మూఁడువత్సరములే యైనను బహుసమర్థత తోడ సంసార సంబంధమగు కార్యములను నిర్వహిం చుచు కుల పరంపరాగత వ్యాపారమునం దీతఁడు విశేష ప్రతిష్ఠ నార్జించి గొప్పగొప్ప ధనికుల

విశ్వాసమునకుఁ బాత్రుఁడై ధనమును గణించు చుండెను

తుకారాముని ప్రథమభార్య పేరు రుక్మాబాయి. ఈమె కాశరోగగ్రస్తురాలగుట వలన ద్వితీయ పత్నిని గ్రహింప వలసిన వాఁడయ్యెను. ఈతని ద్వితీయ భార్యపేరు జిజీబాయి. ఈమె సంసారమునకు యజమానురాలై యుండెను. జిజీబాయి మూర్ఖురాలనియును తిట్టుఁబోతని యును *మహీపతి వ్రాసి యున్నాఁడు. ఈసంగతి యెట్లున్నను, ఈమె పతిభక్తి పరాయణురాలని నుడువుట కణుమాత్రమైన సందియము లేదు. మఱియు నీమె సంసార భారమును వహించి భర్త ధర్మోపార్జనకు సహాయురాలయ్యె నని నిస్సంశయముగఁ జెప్పవచ్చును.

సంసార భారగ్రహణానంతరము కొంతకాలము వఱకును తుకారామున కేవిధమగు కష్టము

(*) ఈయన మహారాష్ట్రభాషయందు భక్తలీలామృతము, భక్తవిజయమను గ్రంథములను వ్రాసియున్నాఁడు.

లు లేకుండెను. ఇట్లుండ ఈయన పదునేడవ వత్స రమునందు తండ్రియుఁ దల్లియుం బరలోకమున కేగిరి. భగవద్భక్తియు వైరాగ్య శీలతయు వంశానుక్రమముగ వచ్చుచున్నను సంపదయుఁ దలిదండ్రుల యందలి ప్రేమయు విషయ సుఖాను రక్తియు సంసార కార్యనిర్వహణ చింతయు నేకమై తుకారాముని యాధ్యాత్మికోన్నతి ప్రయ త్నమునకుఁ గాలము దొరక నీయకుండెను. భావి కాలోన్నతికి విపత్తులు సోపాన ప్రాయములు గదా? సాధారణముగ దారిద్ర్యము విపత్తులు ఉన్నత భావములను అణఁచివేయుచుండును. కాని కొంతమంది పక్షమున నమృతవృష్టియై సద్భావ మను మొలకలను వృద్ధి చేయుచుండును. బాల్య మునుండియు మహదైశ్వర్యములలోఁ దులఁదూ గుసంసారమునందు పెరిగిన తుకారామునకు కష్ట ములు దెలియుటెట్లు? తలిదండ్రులు జీవించి యున్నంత కాలము తుకారామునకు సంసార మా నందసాగరమై యుండెను. కాని తలిదండ్రులు

గతించఁగనే తుకారాముని జ్ఞాననేత్రము లున్మీ
లితము లయ్యెను. సుచరిత్రుఁడును వినయశీలుఁ
డును సంసార కార్యనిర్వహణ చతురుఁడు నగు
తుకారాముఁ డందఱికంటెను తలిదండ్రుల ప్రేమ
కెక్కుడు పాత్రుఁడై యుండుటవలన దలిదండ్రుల
మృత్యువార్తని కతిదుఃఖకరమై యుండుట సహ
జముగదా ? తుకారాముని జ్యేష్ఠసోదరుఁడగు
"శాంజీ" సంసారమునం దుదాసీనుఁడగుట వలన
సంసార భారమంతయు తుకారాముని శిరముపైఁ
బడెను. ఇట్లు కొంతకాలము గడచియుఁ గడువక
మునుపే జ్యేష్ఠసోదరుని భార్య మరణించుట తట
స్థించెను. భార్య గతించఁగనే పంజరమునుండి విడి
వడిన పక్షివలె జ్యేష్ఠ సోదరుఁడు విరాగియై తీర్థ
యాత్రల కేగెను. జ్యేష్ఠసోదరుఁడు విరాగియై
తీర్థయాత్రల కేఁగునప్పటికి తుకారాముని వయ
స్సు పదునెనిమిదివత్సరములు. ఇట్టి వయస్సునందు
విషయ సుఖములయం దాసక్తి లేకుండుట యసా
ధారణము. కాని తలిదండ్రులు భ్రాతృజాయయు

మరణించుటయగాక జ్యేష్ఠసోదరుఁడు విరాగియై
తీర్థయాత్రాపర్యటనఁ డగుట వలన సంసారా
సక్తుఁడగు తుకారామునిహృదయము క్రమక్రమ
ముగ వైరాగ్యమార్గ మవలంబించుచుండెను.
లోభ జనకమును విపత్సంకులమును నగు సంసా
రము నందుండి నిష్కామ భావమున నీశ్వరసేవఁ
జేయుట సులభసాధ్యముగాదను తలంపుననే అ
నేకమహాపురుషులు సంసారములను విడనాడి యే
కాకులై ధర్మాచరణము నందు ప్రవర్తులై ఈప్సి
తార్థముల నందికొని తిరిగి మానవ సంఘమును
సంసారమునఁ బ్రవేశించి జాతీయ తత్వము నందలి
భక్తిజ్ఞాన వైరాగ్యములను ప్రబోధింపఁ జేసి యు
న్నారు. దయామయుని చిర మధుర ప్రేమ రస
మును చవిచూచిన వారికి ధన కనక వస్తువాహ
నము లెట్లు రుచించును? అట్టి వారాత్మ విస్మృ
తులై ఈశ్వర చరణారవింద మరంద పానమత్తు
లై ప్రవర్తింతురనుటను చరిత్రలు వేయినో
ళ్ళ నుద్ఘోషించుచున్న వి. ఈశ్వరప్రేమ యందాత్మ

విస్మృతి యెల్లరకును లభ్యముగాదు. కాని రాజర్షియగు జనకుఁడు మొదలగు కొందఱు మాత్రమే సంపదయందుండియు భగవంతుని యం దాసక్తిగలిగి యుండిరని వినుచున్నాము. దాదాపుగ భక్తులందఱు కష్టములవలన వైరాగ్యమును వైరాగ్యమువలన భక్తిని పొందియుండిరని వివిధ గ్రంథముల యందు వర్ణింపఁబడియున్నది. మానవ జీవితమునందు విపత్తు లపరిహార్యములు. విపత్తులు గలుగుటవలన నెల్లరకుఁ బ్రేమలాభము చేకూర దనుట నిక్కువము. సముద్రము నందు దుముకు వారిలో ననేకులకు నత్తగుల్లలును ఒకరిద్దఱికి రత్నములును లభించు విధముననే సంసార సాగరమునందు పడిపోవు కోట్లకొలఁది మానవులలో స్వల్ప సంఖ్యాకులకు మాత్రమే భగవత్ప్రేమ లభ్య మగుచుండును. కాని సంపదలయందుఁ గాని ఆపదలయందుఁ గాని ఈశ్వరుని చూచుచుండుట కలవడిన వారెప్పుడును ఈశ్వరుని ప్రేమనుండి వంచింపఁబడగనుటకు

పురాతనవాఙ్మయమే సాక్ష్యము. తలిదండ్రులు గతించుటయు సోదరుఁడు దేశాంతర గతుఁడగుటయు ధనమెల్లఁబోవుటయు మొదలగు కష్టముల వలన సంసారసుఖము లనిత్యము లని తోఁచినకొలఁదిని తుకారామునిని వైరాగ్య మావరింపుచుండెను. వైరాగ్య మావరించిన కొలఁదిని ఈశ్వర ప్రేమామృతమును పానముఁ జేయుచు నైమఱచుచుండెను. పూర్వమునందువలె సంసార కార్యములయందు మనస్సును నిలువ నీయక యీశ్వర పాదారవిందభజననిమగ్నత తుకారాముని సర్వసంగ పరిత్యాగునిగ నొనర్చు చుండెను.

లక్ష్మి చంచల స్వభావిని గాదు. ఆమె యాభిమానిని. అందువలనఁ బూర్వమువలె తుకారాము తన సేవయందు మనోనిశ్చలత లేకుండుటను జూచి వానిని వదలుట కాయత్తపడుచుండెను. వర్తకము జరుగుచున్నయెడల అప్పిచ్చుటయు అప్పు దెచ్చుటయు సంభవించుచుండును. కానితుకారామునివైరాగ్యమును జూచి పూర్వ

మునందువలె వర్తకు లీతనితో వ్యాపారమును జేయుట మానుకొనిరి. తుకారామునకు రావలసిన బాకీలు రాకుండెను. కాని యీయవలసిన బాకీల నిమ్మని ఋణదాత లీతనిని తొందర పెట్టుచుండిరి. శ్రద్ధలేని వ్యాపారమునకు ఫలము నష్టము. ఇందువలన తుకారాము చేసిన వర్తకమునం దెల్లను నష్టము వచ్చుచుండెను. ఆదాయము పూర్వమువలె రాకున్నను సంసారవ్యయము పూర్వమువలెనే యుండెను. ఇట్లు కొంతకాలము జరుగునప్పటికి ఋణములు మిక్కుటముకాఁగా సంసారము నెప్పటిస్థితికిఁ దేవలయునని యీయన ప్రయత్నించెను గాని కృతకృత్యుఁడుకాఁ జాలఁడయ్యె. తదుపరి చిల్లరవస్తువు లమ్ము దుకాణమును పెట్టెను. కాని వర్తకుల కుండవలసిన లక్షణములు లేనప్పుడు లాభము వచ్చుటకు వీలులేదుగదా? తుకారాము దుకాణమునందు గూర్చుండి విరామములేక హరిభజనచేయుచు బేరగాండ్రు వచ్చినప్పుడు "వీరిచ్చిన ధనమున కే విధమగు లోపము లేక సరకు లీయవలయును

ఇందు పొరబాటు జరిగినయెడల దోషము సంభ
వించును. కావున బేరగాం డ్రడిగినట్లు సరకుల
నిచ్చుట యుత్తమ మని తలంచి వారడిగినట్లు సర
కుల నిచ్చు చుండువాఁడు" అని మహీపతి వ్రాయు
చున్నాఁడు. ఇట్లు వ్యాపార మొనర్చు చుండుట
వలన దినమున కొక వ్యవహారమునందు ప్రవే
శింప వలసిన వాఁడాయెను. ఇందువలన తుకారా
ముని లోకులు చిత్తచాంచల్యునిగఁ దలంచు చు
నిందించుటకు మొదలిడిరి. "భగవానుని చరణ
కమలముల యందుఁ దగుల్కొనియున్న నామన
స్సును త్రిప్పుకొనుటకు నాకువశముగాదు. కావున
నాశరీరమును వర్తకమునం దర్పించిన యెడల
కుటుంబ కష్టములు దూరమగును" అని తుకా
రాముఁడు తలంచెను. ఇట్లనుకొని హరినామ
స్మరణ చేయుచు నెద్దులపైన ధాన్యపు గోతముల
నైచి చుట్టుప్రక్కల గ్రామములకేగి ధాన్య
మును విక్రయించుచుండెను. కాని తుకారా
ముని వర్తక మార్గము ప్రత్యేకము వేరైనప్పుడు

లాభము వచ్చుటెట్లు? చేసిన వర్తకమునం దెల్ల నష్టము సంభవించిన కొలఁదిని యాయనకు విఠోబా చరణపద్మములయం దనురాగము వృద్ధి యగుచుండెను. తుకారాముఁడు విఠోబా నామమును వినఁగనే యానంద పరవశుఁడై చేతు లఁ దట్టుచు కీర్తనలను బాడుచు మైమఱచి నృత్యము చేయుచు కాలము గడుపుచుండెను. ఇట్లు కొంతకాలము గడచునప్పటికి మూలధన మంతయు వ్యయమయ్యెను. అప్పుదెచ్చి యా తఁడు వర్తకము చేయుటకు గడంగెను. కాని భావోన్మత్తుఁడగు తుకారాముఁడు చేయు వ్యాపారములయం దాదాయ వ్యయములను గమనిం పఁజాలక పెట్టుఁబడి ధనమంతయుఁ గోల్పోయి చిట్ట చివఱకు గృహమునందుఁగల వెండి బంగారు నగ లన్నిఁటిని విక్రయించి వ్యాపారమునందు బె ట్టెను. కాని కృతకృత్యుఁడు కాఁజాలడయ్యె. వర్తకమునందు పెట్టిన ధనమంతయుఁ గోల్పోవుట వలన తుకారాముఁడు దివాలా తీసినాఁడను వార్త

ఇందు పొరబాటు జరిగినయెడల దోషము సంభవించును. కావున బేరగాం డ్రడిగినట్లు సరకుల నిచ్చుట యుత్తమ మని తలంచి వారడిగినట్లు సరకుల నిచ్చుచుండువాఁడు" అని మహీపతి వ్రాయుచున్నాఁడు. ఇట్లు వ్యాపార మొనర్చుచుండుట వలన దినమున కొక వ్యవహారమునందు ప్రవేశింప వలసిన వాఁ డాయెను. ఇందువలన తుకారాముని లోకులు చిత్తచాంచల్యునిగఁ దలంచుచు నిందించుటకు మొదలిడిరి. "భగవానుని చరణకమలముల యందుఁ దగుల్కొనియున్న నామనస్సును త్రిప్పుకొనుటకు నాకు వశముగాదు. కావున నాశరీరమును వర్తకమునం దర్పించిన యెడల కుటుంబ కష్టములు దూరమగును" అని తుకారాముఁడు తలంచెను. ఇట్లనుకొని హరినామస్మరణ చేయుచు నెద్దులపైన ధాన్యపు గోతముల వైచి చుట్టుప్రక్కల గ్రామములకేగి ధాన్యమును విక్రయించుచుండెను. కాని తుకారాముని వర్తక మార్గము ప్రత్యేకము వేఱైనప్పుడు

లాభము వచ్చునెట్లు? చేసిన వర్తకమునం దెల్ల నష్టము సంభవించిన కొలఁదిని యాయనకు విఠోబా చరణపద్మములయం దనురాగము వృద్ధి యగుచుండెను. తుకారాముఁడు విఠోబా నామమును వినఁగనే యానంద పరవశుఁడై చేతులఁ దట్టుచు కీర్తనలను బాడుచు మైమఱచి నృత్యము చేయుచు కాలము గడుపుచుండెను. ఇట్లు కొంత కాలము గడచునప్పటికి మూలధనమంతయు వ్యయమయ్యెను. అప్పుదెచ్చి యాతఁడు వర్తకము చేయుటకు గడంగెను. కాని భావోన్మత్తుఁడగు తుకారాముఁడు చేయు వ్యాపారములయం దాదాయ వ్యయములను గమనింపఁ జాలక పెట్టుఁబడి ధనమంతయుఁ గోల్పోయి చిట్ట చివఱకు గృహమునందుఁగల వెండి బంగారు నగ లన్నిఁటిని విక్రయించి వ్యాపారమునందు బెట్టెను. కాని కృతకృత్యుఁడు కాఁజాలఁడయ్యె. వర్తకమునందు పెట్టిన ధనమంతయుఁ గోల్పోవుట వలన తుకారాముఁడు దివాలా తీసినాఁడను వార్త

క్రమక్రమముగ నెల్లెడల నల్లుకొనుట వలన అప్పులవా రొకరొకరు వచ్చి తుకారాముని గృహ ద్వారమునకడ్డము గూర్చుండి ధనము నిమ్మని పీడింపసాగిరి. వర్తకము చేయువారి పక్షమున దివాలా తీయుటకంటె అవమానకరమగు కార్య మింకొకటి లేదుగదా? తుకారాముఁ డీయవమా నమును భరింపఁజాలక "ఈశ్వరా? నేనీ సంసార మెట్లు నడుపుదును ? నన్నీవిధముగు విపత్తునం దేల పడవైచితివి?'' అని యెలుగెత్తి రోదన్వ నారంభించెను. తుకారాముని దురవస్థను జూచి కొందఱ ఆత్మీయులు ధనసాహాయ్య మొసంగిరి. కొందఱ అప్పులవాండ్రకు పూచీపడిరి. ఇందువలనఁ తుకారామునకు చిక్కులు కొంతవఱకు దీరెను. హరినామ స్మరణవలన తుకారామునకీ దుర్గతి సంభవించినదని బంధుగులు స్నేహితులు నిశ్చ యించుకొని ఈయన నీవిధముగఁ దూలనాడు టకుఁ బ్రారంభించిరి. ''నీవు పరమార్థము నార్జింప నెంచి దివారాత్రములు హరినామస్మరణఁ

జేయుచుండుట వలన నీకీ దురవస్థ సంభవించినది. కావున, ఇపుడైనను విఠోబా ధ్యానమును మానుము. విష్ణుభక్తుల సంసారము లున్నతికి రావని వినుచుందుము. దీనిని నీవు ప్రత్యక్షముగ ననుభవించు చున్నావుగదా? విషయాసక్తి లేనిచో సంసారోన్నతి యెట్లగును? కార్యసిద్ధి యెట్లగును? ఈసంగతిని యోజింపక యెల్లప్పుడును హరినామస్మరణను జేయుచుండిన యెడల అది నీకన్నమును బెట్టునా? నీకొఱకీమాటలను చెప్పుచున్నాము. నీకీమాటల నసమ్మతములు గావచ్చును. కాని మామాటలు విననియెడల నీకు సర్వనాశనము గలుగుననుట నిక్కువము.”

విషయాసక్తులగు వారిపక్షమున నిట్టి యుపదేశములు సత్యములే గదా? తుకారాముని యవస్థనుజూచి బందుగులు స్నేహితు లీవిధముగ నిందించుటయేగాక భార్యయును పైవిధముగ బోధించుటవలన తుకారాముఁ డస్థిరచిత్తుఁడై తిరిగి వర్తకముచేయఁ బ్రారంభించెను. తుకారాము

నకు గోనెలు మోయు ఎద్దులు నాలుగుకలవు. ఈ యెద్దులమీఁద సరకులను వేసికొని గ్రామముల వెంటఁదిరుగుచు క్రయ విక్రయముల కుపక్రమించెను. దొంగల భయమువలన గుంపులు గుంపులుగఁ గూడి ప్రయాణము చేయుచుండు వర్తకుల తోడ తుకారాముఁడు వెళ్లుచు ఉచ్చైస్స్వనమున హరికీర్తనలఁ బాడుచు "హరి హరీ" యని కేకలు వైచి మత్తుఁడగుచుండెను. భక్తి రసామృతమును పంచిపెట్టుట కంటె భక్తుల కానంద జనకమగు కార్యమెద్దిగలదు? కాని భయావహులును విషయాసక్తులు నగు సహచర బృందమునకు హరిభజన కర్ణకఠోరమై వారు మత్తుఁడగు తుకారాముని మార్గమధ్యమున విడిచి పోవుచుండిరి. ఇందువలన అప్పుడప్పుడు తుకారాముఁ డేకాకియై వెళ్లవలసి వచ్చుచుండుటచేత ననేక కష్టములకు లోనుగావలసిన వాఁడయ్యెను. ఒకానొక దినమున నిర్జనమార్గము నందొంటరిగ హరిభజనఁ జేయుచుఁ బోవుచుండఁగా నొకవృషభము డస్సి

పడిపోయెను. ఎద్దుమీఁది సరకుల గోతము ఒరుల సాహాయ్యము లేనిది దించుటకుఁ జేతఁగాక హరి నామస్మరణఁ జేయుచు నలుదిక్కులు చూచుచుండునంతలో సూర్యాస్తమయమయ్యెను. మేఘములు క్రమక్రమముగ దట్టములగుచుండెను. తీవ్రశీతలవాయువు వర్షాగమనమును సూచించుచుండెను. ఇట్టి సమయమునం దాకస్మికముగ నొకఁడా* మార్గమునవచ్చి గోనెనుదించి యెద్దును లేవఁదీసి తిరిగి యెద్దుపైన గోతమును వైచుటవలన తుకారాముఁడు గమ్యస్థానమును చేరఁగలిగెను. ఈ విధముగ వ్యాపారము చేయ మొదలిడిన కొద్ది దినములకే మూడెద్దులు మరణించుటవలన విషణ్ణ

* విఠోబా దేవుఁడు పథికుని వేషమును ధరించివచ్చిభక్తునకు సాహాయ్యమునుజేసి వెళ్ళెనని మహారాష్ట్రమందు తుకారామచరిత్రను వ్రాసిన మహీపతివ్రాయుచున్నాఁడు. కాని మహాపురుషుల జీవనచరిత్రములయం దాశ్చర్య విషయములను జొప్పించుటయు సామాన్యవిషయములను అద్భుతముగ నిర్వచించుటయును తెలుచుగఁ జూచుచున్నాము. ఆదేవిధముగ ఈయనచరిత్రయం దనేకాశ్చర్య విషయములు గలవు.

చిత్తుఁడై స్వగృహమున కేగెను. తుకారాముని అశ్రద్ధవలన నెద్దులు మూడు మరణించినవని స్నేహితులు బాధుగులు మొదలగువార లితని నిందించుటకు ప్రారంభించిరి. దారిద్ర్యము దాంపత్య ప్రేమను భంగపఱచు ననుట సర్వసాధారణ విషయము గదా? కావున దరిద్రపీడితయగు జిజీబాయి సంసారమును పోషించుమార్గమును గానక ఈయనను నిందించుటకుఁ బ్రారంభించుటచేత తుకారాముఁ డెక్కుడు మనోవ్యథను బొందవలసిన వాఁడాయెను.

—ooo—

## రెండవ ప్రకరణము



ఆత్మను భగవంతుని పాదారవిందములకును శరీరమును సంసారమునకును సమర్పించి తుకారాముఁడు తిరిగి మిరపకాయలవ్యాపారమును చేయుటకు కొంకణ దేశమున కేగి సముద్రతీరమందలి యొకానొక గ్రామములోని దేవాలయసమీపమున మిరపకాయల దుకాణమును పెట్టెను. ఇప్పుడును తుకారాముఁడు మామూలు ప్రకారమే మిరపకాయల విక్రయమునకుఁ బ్రారంభించెను. క్రయదారు లిష్టమువచ్చినంత ధనమిచ్చి యిష్టమువచ్చినన్ని మిరపకాయలను దీసికొని వెళ్లుచుండిరి. తుకారాము మాటిమాటికి హరినామ స్మరణఁ జేయుచుఁ జూచుచుండెను. ఈవిధముగ నొకటి రెండు దినములలో దుకాణ

ములోని మిరపకాయ లన్నియు దాదాపుగఁ బూర్తియయ్యె. ఇట్టి సమయమునం దొకానొకఁడు వచ్చి "నేను కడు బీదవాఁడను. ఈదినము బంధుగులచే నాగృహము నిండియున్నది. మిగత వస్తువు లచ్చటచ్చట సమకూర్చుకొంటిని. కావున మీదగ్గఱ నిలువయున్న మిరపకాయలను నాకు విక్రయింపుఁడు. త్వరలో మీఋణమును దీర్చు కొందును" అని ప్రార్థించెను. ఆనుడువు లాలించి తుకారాముఁడు మాఱు మాటాడక మిగిలియున్న మిరపకాయలనన్నిఁటిని దీసికొని వెళ్లుడని నుడివెను. అంతట వాఁడు "ఈమిరపకాయలను దీసికొని వెళ్లుటకు నాయింట గోతము లేదు. కావున గోతము తోడ మిరపకాయల నిచ్చినచో క్రయ ధనమును నిచ్చునప్పుడు మీగోతమును గూడ మీ కిచ్చెదను". అను మాటలను విని గోతము తోడ మిరపకాయలను దీసికొని వెళ్లుఁడని తుకారాముఁడు చెప్పెను. ఈ వ్యవహారమునందులాభము మాటయటుండ పెట్టుబడిసొమ్మునందు మూఁడువం

తులు నష్టమువచ్చెను. మిగిలిన స్వల్పధనముతో నీ
యన స్వగ్రామమునకువచ్చుచుమార్గమధ్యమునం
దొక వంచకునిచేఁ జిక్కెను. ఈవంచకుఁ డీయ
నకు గిల్టు నగలను చూపించి బంగారు నగలని
నమ్మునట్లుగఁ జెప్పి వీని విక్రయమువలన విస్తారము
లాభము రాగలదని తుకారామునితో నుడివెను.
సరళ స్వభావుఁడగు తుకారా మీవాక్యములను
విశ్వసించి యీనగలను కొనుటకు చాలినంత
ధనము తనయొద్ద లేదని నుడువగా వంచకుఁడు
"నీవు సత్యవాదివలెఁ గన్పట్టుచున్నావు. ఇందు
వలన నీపైన నాకు విశ్వాసము కలిగినది. కావున
నీచేతనున్న ధనమును మాత్ర మిపుడిచ్చి బాకీ
పడిన మిగతధనమును వీలును బట్టి తీర్చుకొమ్ము"
అనిచెప్పెను. ఆమాటలను విని తుకారాము
చేతనున్న ధనమంతయు నిచ్చి గిల్టునగలను గైకొ
నెను. ఈ వ్యవహారములకు బంధుమిత్రుల
వలన తుకారా మెట్టి తిరస్కారములను పొంది
యుండునో వేఱుగ వ్రాయ నవసరము లేదుగదా!

తుకారాముని ద్వితీయభార్యయగు జిజీబాయి సంసారమునకు కర్త్రిణియై యుండెనని పూర్వ ప్రకరణము నందుఁ జదివియున్నారు. దివాలాఁదీయుటచేత లోకులు భర్తను విశ్వసింప కుండిరనియు వణిగ్వంశము నందు జన్మించుటవలన వర్తకము దప్ప వేఱుమార్గము లేదనియు జిజీబాయి తలంచి తిరిగి వర్తకము చేయ వలయునని భర్తను ప్రార్థింప సాగెను. కాని ధనమెక్కడ? జిజీబాయి ధనికుని కొమార్తె యగుటవలన నీమెపైని వర్తకుల కొకింత విశ్వాసముండెను. ఇందువలన నామె యొకానొక ధనికునియొద్ద రెండువందల రూప్యములు ఋణముదీసికొని భర్తకిచ్చి వర్తకము చేయుఁడని ప్రోత్సాహపఱిచెను. ఈసమయమునం దాగ్రామములోని వర్తకులు "వాలేఘాట్టు" అను స్థలమునకు వర్తకమున కేగుచుండిరి. తుకారాము వీరితో నేగి క్రయవిక్రయముల కుపక్రమించినకొలఁదిదినములలోనే తోడి వర్తకుల సాహాయ్యము వలన వర్తకమునం

:బడి రూప్యములు లాభము లభించెను. కాని
ర్తకులతోడ తుకారాము గృహాభిముఖుఁడగు
సమయము నందు ఋణగ్రస్తుఁడైన యొక బ్రాహ్మ
ని రాజభటులు వెంబడించి వెళ్లుచుండిరి.
ఁకు జీర్ణవస్త్రమునుధరించి మెడకుఁజుట్టుకొని
ఁన్న ఇనుపశృంఖలముల బరువును మో
ుఁ జాలకవంగి వంగి నడుచుచున్న యా
ాహ్మణుఁడు చూపఱులకు జాలి గొలుపు
ండెను. సాధ్వీతిలక మని చెప్పనొప్పు బ్రాహ్మణి
యవెంట నడుచుచు ప్రాణనాథుని దురవస్థకు
తపించుచుండెను. ఈ బ్రాహ్మణుఁ డీవిధముగఁ
రెండు వత్సరములనుండి పర్యటనముఁ జేయు
యాచనవలన లభించిన ధనమును రాజభటుల
ొచ్చుచుండెను. కాని ఋణవిముక్తుఁడు గాఁజా
కయెను. ఈ బ్రాహ్మణున కీయనతోడి వర్తకు
కటి రెండణాల చొప్పున దానముచేసిరి.
ప్రేమపూరితహృదయుఁడగు తుకారాము
ాహ్మణుఁ డీయవలసిన ఋణశేషము నంతయు

రాజభటుల కిచ్చి బ్రాహ్మణుని ఋణ విముక్తుని గావించెను. తదుపరి ఆ దంపతులకు నూతనవస్త్ర ముల నిచ్చి మృష్టాన్న భోజనమును బెట్టించి పర మానంద భరితుఁడై తనచేత మిగిలియున్న ధన మును దక్షిణగ బ్రాహ్మణున కర్పించెను. పంద్రెం డు వత్సరములనుండి క్రూరదండన ననుభవించు చున్న బ్రాహ్మణుఁడు తుకారాముని కరుణ వలన ఋణ విముక్తుఁడై శాంతిలాభము నొందెను. భక్తావతంసుఁడగు తుకారాముఁడు తనధనమునం తయు బ్రాహ్మణునకు సమర్పించి ధనబంధనముల నుండి విముక్తి నొందెను.

తుకారాముఁడు స్వగృహమును ప్రవేశింపక పూర్వమే తోడివర్తకుల వలన జరిగిన వ్యవహార మంతయును భార్యయు మిత్రులును విని ఆయనకు పిచ్చియెత్తిన దని సిద్ధాంతీకరించిరి. దరిద్రముచే పీడింపఁబడుచున్న జిజీబాయి కోపానలమునకు మేర లేదయ్యెను. ఇందువలన తుకారాము గృహమున నివసించుటకే దుస్తరము కాఁజొ

స్త్రైను. ఇట్లు కొంతకాలము జరుగునప్పటికి వర్షాభావమువలన మహారాష్ట్రదేశము క్షామదేవత పాలంబడియె. ధాన్యమునకు రెండు సేర్ల ద్రవ్యమైనను దొరక కుండెను. తుకారాముని కుటుంబమువారు మలమల మాడఁజొచ్చిరి. కుటుంబ దురవస్థను జూచి సహింపఁజాలక తుకారాముఁడు ఇరుగు పొరుగు వారిని సాహాయ్యము చేయుఁడని కోరెను. కాని సాహాయ్యము చేయువా రెవ్వరు? మీఁదు మిక్కిలి కొందఱు "విఠోబా నడుగుము. ధాన్య మిచ్చును" అని హేళనచేయుటకు మొదలిడిరి. కాని భక్తులు దూషణ భూషణలకు లొంగరు గదా? క్షామ మింకను ఘోరమగు చుండెను. ప్రజలు గృహములను వదలి చెట్టుగుట్టలు పట్టి యాకలములను దిని కాలము గడుపుట కుపక్రమించిరి. ఈ సమయమునందు బహుదినములుగా కాశరోగగ్రస్తురాలగు తుకారాముని ప్రథమ భార్య మరణించెను. ఈ కారణమాధారముగఁ గైకొని లోకు లితని

వేయిముఖములఁ నిందింపసాగిరి. గ్రామదేవ తకు వేలకొలఁది మానవులు బలి యగుచున్నను సంపదతోఁ దులదూగుచుండిన నీసంసారము తుకారాముని హరిభక్తి వలన దరిద్రవంతమై తినుట కన్నములేక భార్య గతించెనని నిందించు చుండిరి. ఇట్టిదుఃఖ సమయమునందు బంధువుల తిరస్కారములు తుకారాముని హృదయమునకు శూలములై నాటుకొను చుండెను. ధన కనక వస్తు వాహనము లన్నియుఁ బోయెనని కాని లోకులు తన్ను నిందించు చున్నారని కాని తుకా రాముఁడు కష్టము ననుభవించిన వాఁడు గాఁడు. విఠోబా దేవుని నిందించుచుండుటయే ఈయన పరితాపమునకుఁ గారణము. అప్పుడప్పుడు విఠో బా దేవుని నిందించు వాక్యములను విని సహింపఁ జాలక "విఠోబాదేవుని నామ మెన్నఁడు నుచ్చరిం పని వారల భార్యా పుత్రాదులు గతించుటకును దరిద్రులగుటకును కారణమే" మని ప్రశ్నించుచు పరమేశ్వరుని నిందించుట అజ్ఞానఫలమని బోధిం

చుటకు మొదలిడి మైమఱచి నృత్యము చేయు చుండెడి వాడు. భక్తి రసామృత సింధువునం దోలలాడు వారల జన్మమే గదా ధన్యము.

భార్య గతించిన కొన్ని దినములకే ఈయన ప్రథమ పుత్రుడు పరలోక యాత్ర కేగెను. ఇందు వలన తుకారాముడు దారుణవేదన ననుభవించెను. కాని ఈశ్వర విధానమును గ్రహించుట కెవరికి సాధ్యమగును ? ఈశ్వరుడు భక్తుల ఘోర పరీక్షల యందేల పరీక్షించుచుండునో నుడువుట సామాన్య విషయము గాదుగదా? మానవజీవితమునందు కష్ట సుఖము లపరిహార్యములు. పుటములు పెట్టిన కొలదిని బంగారు మేలిమి యగువిధముననే కష్టములు సంభవించిన కొలదిని భక్తులు పవిత్రులగు చుందురు. బాల్యము నుండియు భక్తిపరవశుడై యున్న తుకారామున కింతవఱకును జ్ఞానము పరిపక్వము కాలేదు. సంసార సుఖములపై నాసను పూర్తిగ విడనాడ దయ్యెను. కాని కష్టముల మీద

కష్టములు సంభవించు చుండుటవలన సంసార మనిత్యమనియు, సుఖదుఃఖములు క్షణభంగుర ములనియు, అనుభవమునకు వచ్చిన కొలఁదిని వైరాగ్యము వృద్ధి కాఁజొచ్చెను. వైరాగ్యాభివృద్ధితోడ అహేతుకీభక్తి యలవడుచుండెను. అవిద్యారూపకమగు రాత్రిగడువఁగనే, ఈయన హృదయాకాశమునందు ప్రజ్ఞానమయ సూర్యోదయం బయ్యెను. అంత జ్ఞాన ప్రపంచము దృగ్గోచరంబాయెను. హలాగ్రమున భేదింపఁబడక భూమి పండనటులనే ఆత్మాభిమానము విషయేచ్ఛాలసలతోడ పరిపూర్ణమగు కఠోర మానవ హృదయము దుఃఖముల వలన పరితపింపఁ బడని యెడల ఈశ్వరప్రేమను గ్రహింపఁజాలదు. మహీపతి యీసందర్భమునం దీవిధముగ వ్రాయుచున్నాఁడు. "కృషీవలుఁడు గ్రీష్మకాలపు ప్రచండోత్తాపమునం దుత్తప్తుఁడై సంతత వర్షధారల నోలలాడి ఫలరూపమగు నానందమునుబొందునటులనే భక్తుఁడు గణనాతీత క్లేశముల కోర్చి

బహు పరీక్షల నతిక్రమించి తదుపరి భగవద్దర్శన ఫలమును ననుపమానమగు నానందమును బొంది దుఃఖ విస్మృతుఁడగును." భార్యాపుత్రులు గతించుటవలన తుకారాముని జుట్టియున్న మోహపాశములు తుత్తునియలు కాఁజొచ్చెను. తాను సంసార మోహాంధకారమునం దంధప్రాయుఁడై తిరుగుచుండుటకు పరితాపమును బొందుచుండెను. ఈ సమయమునందు తుకారాముని మానసికావస్థను గూర్చి మహీంపతి ఇట్లు వ్రాయుచున్నాఁడు. "సంసారోన్నతి కొఱ కెన్నియో పాట్లుపడితిని. కాని ఇందువలన సమకూర్చిన లాభమెద్ది? దుస్సహ దుఃఖమే లభించెను. సంసారమున దుఃఖములు పర్వతప్రమాణములు. సుఖములు స్వప్నజనిత భ్రాంతి తుల్యములు. నా యాయుఃపరిమితి బహు స్వల్పముగదా? ఇందుఁ జాలభాగము సంసార సేవయందే గడచెను. కాన నీ శేషజీవితమును రుక్మిణీ మనోనాథుని సేవయందు గడుపుదును." తుకారాముఁ డీవిధముగఁ దలపోయుచు జీవిత

లక్ష్యమును స్థిరపఱచుకొని హృదయశాంతి నొందెను. పుత్రికా పుత్రులను తలిదండ్రులను విడనాడి అనంతప్రేమ సాగరము నందు మనో నాయకునిఁగూడి తేలియాడుటకు మృతభర్తృశరీరమును వడియందిడికొని ఘోరాగ్నిజ్వాలల మధ్య భస్మీపటలమగు సతివలె తుకారాముఁడు ప్రాణవల్లభుని చరణారవింద సేవాపరాయణచిత్తముతోడ సంసారబంధనములం ద్రెంచుకొని దేహూగ్రామమున కనతిదూరమందున్న భాస్వానాథ పర్వతారణ్యమును జొచ్చి కఠోర తపస్సున కుపక్రమించెను.



# మూడవ ప్రకరణము

—∞⊱✽⊰∞—

నిర్జన ప్రకృతికిని సాధకుని హృదయమునకుం గల సంబంధ మతిమధురము. సంసార కోలాహలములు హృదయ శాంతికి భంగకరములని తలంచి ప్రకృతియొక్క నిస్తబ్దాంకమునందు శాంతిలాభమును బొందుటకు ప్రయత్నించు సాధకుండు దృష్టిని నిరోధించి జ్ఞాననేత్రముల ద్వారా ప్రాణనాథుని సందర్శించి పరితృప్తి నొందు చుండును. తుకారాముండు భాస్వానాథ పర్వతమున కేగి స్వీయారాధ్య దేవుండగు విఠోబా దేవుని ధ్యానమునందు ప్రవృత్తుండయ్యెను. అనేక దినముల నుండి ఎవరిని వ్యాకుల హృదయమున నన్వేషించుచుండెనో ఆయనను నేడు తుకారాముండు హృదయ సింహాసనమునం దావిర్భావముం జేసి

కొని ఆత్మోపలబ్ధినొంది కృతార్థుఁడాయెను. వైష్ణవభక్తు లీశ్వరుని ప్రేమాస్పదునిగను జీవాత్మను ప్రేమించు దానినిగను వర్ణించి యున్నారు. ప్రేమాస్పదుఁడగు భగవానుని దర్శనము స్పర్శనము చింతనముల వలన గలుగు సుఖము శాశ్వతానంద జనకము. ప్రేమాస్పదుని దర్శన మబ్బని యెడల ప్రేమించుదాని హృదయ మధీరమగును. ప్రేమాస్పదుని సాక్షాద్దర్శనము వలన ప్రేమించు దాని హృదయ మమృత సిక్త మగును. ప్రేమాధురి శాశ్వతసౌఖ్య దాయకము గదా? నూతనానురాగావస్థ యందు ప్రేమించుదానియొక్క ఆతురతతోఁ గూడిన సుఖముతోఁ బోల్పఁదగిన సుఖ మితరసమయములయం దనుభవమునకు రాదనుట నిక్కు.వము. తుకారాముఁడు నవానురాగజనితసుఖనిమగ్నుఁడై సంపూర్ణముగ నాత్మవిస్మృతినొంది కాలభేదము లేక ప్రాణవల్లభుని సహవాస సుఖమున కాలము గడపుచుండెను. తుకారాముఁ డెచ్చట కేగినదియుఁ దెలియక ఆత్మ

యులు వెదుక నారంభించిరి. తిరిగి తిరిగి కని
స్వసోదరుఁ డంబానాథ పర్వతోపరిభాగమున
తుకారాముని గలిసికొనెను. సోదరుని యనురో
ధము వలన తుకారాముఁడు అంబానాథ పర్వత
మును విడిచి ఇంద్రాణీ నదీతీరమునకు వచ్చెను.
పశుపవాసములు గడచిన పిమ్మట స్వగృహమునం
దీయన భుజించెను. సోదరుఁడు సంసారికావస్థను
బోధింపఁదొడంగెను. ఈయన చేసిన వర్తకము
వలన ధన కనక వస్తువాహనము లన్నియుఁబోయి
నను తండ్రిగారిచ్చిన అప్పులపత్రములు కొన్ని
మాత్రము మిగిలియుండెను. తుకారాముఁడు
విషయ కార్యములయం దుదాసీనుఁడగుట వలన
బాకీలు రాఁబట్టుకొనుట కణు మాత్రమైనను బ్రి
యత్నింపక ఒకానొక దినమునం దింద్రాణీ నదీ
ప్రవాహమునందు బాకీలపత్రములను బాఱవే
యఁ బ్రయత్నించి తమ్ముని మనోభావమును
గ్రహించి సగము పత్రములను తమ్మునకిచ్చి
తక్కినవి తనవంతు సగముపత్రములను నదీజ

లమునఁ బడవైచి "శీతాతపములకీ గొంగడియు భిక్షాన్నమునకీ మృణ్మయ పాత్రయు నాధార మగుఁగాక" అని నుడువుచు తమ్మునకు సెలవిచ్చెను. తదుపరి తుకారాముఁడాత్మశుద్ధిఁ గోఱకు ప్రాతఃస్నానమును, దేవమందిరములను శుభ్రపఱచుటయును, పుణ్యకాలములయం దుపవసించుటయు, మొదలగు కార్యములను జేయుచు, ధ్యానధారణ సమాధుల యందుఁ బ్రవృత్తుఁడై ఇంద్రియ దమనార్థము దినముల వరుసను ఆహారమును తగ్గించుచు నిద్రను నియమబద్ధముగ నొనర్చెను. దేహూ గ్రామమునకు రెండుక్రోసుల దూరమునందు భాండూర్ అను పేరుగల సుందరపర్వతమొండు గలదు. దినమంతయు నాసుందరపర్వతముపైఁదిరుగుచు ఇతఁడు రాత్రి దేహూ గ్రామమున భక్తులతోఁజేరి సంకీర్తనఁ జేయుచుండెను. తుకారాముని జూచి వర్తకమునందు నష్టము వచ్చుటవలన పిచ్చియెత్తినదనియు మహాభక్తుఁడగుట వలననే ఇంద్రాణి జలములయందు మిగిలిన

సర్వస్వము నర్పించెననియుం బొట్టకూటికిం గాను భక్తుని వేషముసుధరించి నాఁడనియు పలువురూ పలువిధములం బల్కఁదొడంగిరి. గమ్యస్థానము దృష్టిపథముననుండి దృఢ విశ్వాసమున నిర్గమించు వానికి నిందాస్తుతులు బంధనములు కాఁజాలవు గదా? ఇంద్రాణీనదీతటతరుచ్ఛాయలలోను, భాండార పర్వతకందరములయందును ఏకాకిగ సంచరించుచుండు తుకారాముని యొక్క భక్తి విశ్వాసములు ప్రకృతిసాహాయ్యము వలన దిన దినాభివృద్ధి నొందుచుండెను. ఇంద్రాణీనదీ కలకల శబ్దముల యందును, విహంగ గణములమృదుమధురరుతముల యందును, గిరిగహ్వార ప్రతిధ్వనుల యందును, ఇతఁడు ప్రియతముని కంఠధ్వనిని వినుచుండెను. బహుదూరమువఱకు వ్యాపించిన స్నిగ్ధ శ్యామశోభల యందును, పుష్పగుచ్ఛముల సౌందర్యఘటనావిధానమునందును, శ్యామ సుందర మూర్తి యొక్క సౌందర్యమును జూచు చుండెడివాఁడు. సుస్నిగ్ధ శీతలసమీరతరంగముల స్పర్శవలన నాచిర

శీతలుని స్పర్శానుభవమును బొందుచు పులకాంకురితుడై మధుపాన మత్త మధుపంబు సేయు మధుర ఝుంకారము ననుకరించి మనోవల్లభుని కీర్తిని గీర్తించుచుండెడి వాఁడు. ప్రకృతియొక్క సౌందర్యసాగరవీచికా మర్మర స్వనంబులతో శ్రుతిఁగలిపి విరహ గీతములఁ బాడుచుండెడివాఁడు.

ఈయన భజనఁజేసికొనుచు దిరుగుచుండుస్థలమునానుకొని యొకానొక కాఁపువాని పంట పొలముండెను. ఆభూస్వామి తుకారామున కిట్లనియె "నీవెప్పు డిచ్చటనే తిరుగుచున్నావు. కనుక నీపొలములోని సస్యమును రక్షింపుము. ఇందువలన మనకిరు వురకు నుపకారము గలుగును. ఈ క్షేత్రమునందు ఫలించిన ధాన్యములో నాల్గవ వంతు నీకిచ్చెదను" అను నుడువు లాలించి కృషికున కుపకారము గలుగు నను తలంపున వాని మాటల కంగీకరించెను. ఆభూస్వామి క్షేత్రమధ్యమునందుండు మంచెపై తుకారాముని కూర్చుండఁబెట్టి పిట్టలు భయపడుటకుఁగాను పెద్ద కఱ్ఱను

చేతి కిచ్చెను. భాగ్యోన్మత్తుఁడగు తుకారాముఁడు కంకులమీఁద వ్రాలి గింజలను భక్షించు పక్షులను జూచి "క్షుధాతురములగు నీపక్షుల నెట్లు వెడలనడంతును? మహాక్షామమగుటవలన వీనికిఁ దగినంత యాహారము లభించుట లేదు. పరమేశ్వరుని కృపవలనఁ ద్వరలో వర్షము గురియుఁగాక! కడుపు నిండ భుజించి పక్షులానందమున చరించుఁ గాక" అని తలంచుచు పగలు రెండు జాములగు నంతటనే పక్షులవంకఁదిరిగి "నదికేగి నీరుద్రావి రండని కేకలు వైచుచు లేవఁగొట్టి" సంధ్యా సమయమున "చీకటి పడుచున్నది. మార్గము తప్పి పోవుదురు. కనుక మీమీ నిలయములకు కను వెలుతురుననే అరిగి సూర్యోదయ మైనంతటనే తిరిగి రండని" చెప్పుచు పక్షులఁ దరుముచుండెను. మఱియును, ఈపక్షులు కావలసినంత వఱకు భుజించుచున్నవిగాని మఱుదినమున కణుమాత్ర మైనను దాచుకొనుటలేదుగదా యని తలంచి నాయవస్థ యెప్పు డీవిధముగ నగునని తుకారా

ముఁడు భగవానుని ప్రేమపై నిర్భరపడి మఱుదిన
పు చింతనుండి విముక్తుఁడగుటకు ప్రయత్నించు
చుండెను. రాత్రి ప్రతిమవలె మంచెపైన నిశ్చేష్టిత
భావమున నుండు తుకారాముని జూచి పక్షులు లే
శమైనను భయపడక తండోపతండములుగ వచ్చి
కంకులను భక్షించి యేగుచుండుటవలన స్వల్ప
దినములలో నాక్షేత్రమునందలిపంటలో జాల భా
గము పూజ్యమాయెను. క్షుద్బాధా పీడితులగు
వేలకొలఁది మానవులకన్న మిడి సంతసించు మహా
దాతవలె పక్షులు భుజించుటను జూచి తుకారా
ముఁ డానందమును బొందుచుండెను. "ఆత్మవత్
సర్వ భూతాని" అను న్యాయము ఉక్తులయం
దును జ్ఞానమునందును గాక ఆచరణయందుఁ బెట్టి
ఆత్మానందమును బొందువారలే గదా ధన్యులు!
ఆ భూస్వామి తనక్షేత్రమును జూచి కుపితుఁడై
తగు మనుష్యులతోఁ జెప్పి మధ్యస్థము చేయుఁడని
కోరెను. మధ్యవర్తులు తుకారాముని ప్రశ్నింపఁ
గా "ఈసమస్తజీవములు క్షుధానుసారముగ

భుజించి తృప్తిఁజెందుచున్నవి. కాని మఱునాఁటి దినమును గూర్చి చింతించుటలేదు. కావున నీకడ్డు కాలమున ఈపక్షులను రక్షించుటయే నా ప్రథమ కర్తవ్యము" అను తుకారాముని మాటలను విని భూస్వామి నిందించుటకుఁ బ్రారంభించెను. తా మంచనవేసిన ధాన్యమునందు తఱిగిపోయిన ధాన్యమును భూస్వామికి తుకారాముఁడీయవలయునని మధ్యవర్తులు తీర్మానించిరి. కాని భూమిలోని సస్యమును గోసి సూర్చగా భగవానుని కృపవలన పండవలసిన దానికంటె రెండు రెట్లు మిక్కుటముగ పండెనని మహీపతి వ్రాయుచున్నాఁడు. ఈవిషయమున మతభేదము లుండవచ్చును. కాని స్వంత భూమియైనను తుకారాముఁడీ విధముగనే చేయువాఁడని చెప్పుటకు సందియములేదు. మఱియును, ఈసందర్భమునందీయన సరళత్వమును జీవదయాపరత్వమును ప్రశంసింపక మూకీభావమును వహింపఁజాలము గదా?

ఈయన పూర్వపురుషుఁడగు విశ్వంభరుఁడు

దేహూ గ్రామమునందుఁ గట్టించిన విఠోబాదే
వుని మందిరము శిథిల మగుచుండుటవలన బాగు
చేయుటకీయనప్రాను కొనెను. కానిధన మెచ్చుట?
స్వహస్తముల తోడ మందిరమును బాగుచేయు
టకు ప్రయత్నించి మట్టి ప్రహారీ గోడను పెట్టుట
కుపక్రమించెను. సదిచ్ఛతోఁ గూడిన కార్యము
ష్టాఁను భగవానుని కృపవలనఁ బూర్తియైతీరును
గదా? కాబట్టి ఈయన ప్రయత్నమునకు సాహా
య్యముతనంతటఁదానుగ వచ్చుటవలన స్వల్పదిన
ములలో దేవాలయమును బాగుచేయించి అన్న
దానమునఁ జేయించెను.

ప్రతిదినమును భక్తులు నవ్యగీతములతోడ
విఠోబా దేవుని స్తుతించుటనుజూచి గీతగుచ్ఛ
ముల రచియించి విఠోబాదేవుని పాదయుగళము
నందర్పించుట కొఱకు తుకారాముఁ డువ్విళ్లూరు
చుండెను. ఇందువలన పూర్వకవి విరచితము
లగు భక్తిగ్రంథములను తదేకనిష్ఠతోఁ జదువు

టకుఁ బ్రారంభించి* నామదేవునియభంగములను
పఠించి భక్తితత్త్వము నాస్వాదింపసాగెను. తదుపరి
కబీరుకీర్తనలు † జ్ఞానేశ్వర కృతమగు గీతా వ్యా
ఖ్యానమును అమృతానుభవమును గ్రంథమును

---

* నామదేవుఁడు పదుమూడవ శతాబ్ది శేషభాగమునం
దుండెను. మహారాష్ట్రదేశమునందు ప్రప్రథమమున భక్తిబీ
జము నాటినదీ మహాపురుషుఁడే. ఇందువలన మహీపతి మొద
లగు భక్తచరితాఖ్యాయికా కారులు నామదేవుని యుద్ధవుని
యవతారమని వర్ణించియున్నారు. ఈయన రచియించిన
గ్రంథమేదియుఁగానరాదు కాని అభంగములిప్పటికిని బాడు
చుందురు. అనేకులు నామదేవుని యవతారమే తుకారాముఁ
డని విశ్వసించుచున్నారు.

† జ్ఞానేశ్వరుఁడు నామదేవుని సమకాలికుఁడు. ఈయన
జ్ఞానమార్గమునఁ బ్రసిద్ధికెక్కి యుండెను. ఈయన రచియిం
చిన గీతావ్యాఖ్యాన మతి విస్తీర్ణమై పాండిత్య ప్రభావమును
వెల్లడించు చుండును. మహారాష్ట్రదేశమునం దీ వ్యాఖ్యాన
మును 'జ్ఞానేశ్వరీ' యను పేరునఁ బిలుచుచుందురు. భాగ
వతము మొదలగుగ్రంథములతోఁబాటు దీనికి గౌరవమును
జూపుచుందురు.

‡ ఏకనాథస్వామి విరచిత భావార్థరామాయణ మును శ్రీమద్భాగవత వ్యాఖ్యానమును యోగ వాసిష్ఠరామాయణము మొదలగు గ్రంథములను జదివినకొలఁదిని భక్తియొక్క నిగూఢతత్వమును దెలిసికొనియెను. ఈ గ్రంథములలోని గభీర తత్వములను మననముచేయుటకుఁగాను భాండార పర్వత కందరముల నాశ్రయించి యేకాకిగఁ దిరుగుచుండెను. స్వభావసిద్ధముగ జ్ఞాపకశక్తి యద్భుతముగాఁగల తుకారాముఁడితరచింతలులేక సర్వదా భక్తి తత్వమును మననము చేయుచుండుట వలన నచిరకాలములోనే భక్తిశాస్త్రము నందు పారదర్శికుఁడగుటయేఁగాక ఏయే మహాపురుషుల గ్రంథము లీయన పఠించెనో ఆయా మహానుభావుల చరిత్రములలోని సద్గుణములు గంభీరభావములు ఈయన హృదయము నందు ముద్రితము

‡ ఏకనాథస్వామి పదునారవ శతాబ్దాంతమునందు జన్మించెను. ఈయన తుకారామునివలె భగవద్భక్తియు, జీవదయాపరత్వముఁగల మహాపురుషుఁడు

లయ్యెను. పిమ్మట నీయన కవిత్వమును జెప్పుటకు మొదలిడెను. ఈకవిత్వవికాసమే తుకారాముని నవ జీవనమునకు మూలాధారము. ఇంతటి నుండియు "శేట్" తుకారాముడు "భక్త" తుకారాముడయ్యెను.



## నాల్గవ ప్రకరణము.



జీవదయా పరత్వమును భగవంతుని యందను రాగమును ధర్మముయొక్క ప్రధానలక్షణములు. మహాపురుషుల ధర్మజీవితములం దీలక్షణములు ప్రకాశించుచుండును. భగవానుని యందనురాగము గలవారలు పశు పక్షి తరులతాదులను భగవంతుని చిహ్నములుగ భావించి ప్రేమించుచుందురు. ప్రాణనాథుండు వ్రాసిన యుత్తరము లభించినప్పుడు దానిని ప్రాణపదముగ దాచుకొను భార్యవలెనే విశ్వేశ్వరుని యందనురాగముఁగల భక్తులు విశ్వపదార్థము లన్నిఁటిని ప్రియతమములుగఁ జూచుచుందురు. తిరిగి తుకారాముఁడు దేహూ గ్రామమునకు వచ్చిన పిమ్మట విశ్వసేవా వ్రతమునకుఁ బూనుకొనెను. సంకీర్తన జరుగుస్థలములలో భక్తులకు రాళ్లు మొదలగునవి గ్రుచ్చుకొను నను

తెలెంపున ఆస్థలముల స్వహస్తములతో నూడ్చి
హరిభజనచేయు సమయమున భక్తులకు విసరుచు
లాంతరు చేఁబూని గృహముల కేగు భక్తులకు
మార్గమును జూపుచుండెను. విఠోబా దేవుని
సందర్శించుటకు వచ్చిన భక్తులు దేవళములోని
కేఁగఁగనే ద్వారముకడ నుండి పాదరక్షలను
కాపాడుచుండెను. రాజపథమున బరువు మో
యుచు కష్టపడుచుండు వారలఁజూచినచో వారి
శ్రమ తగ్గ గలందులకుఁగాను తానాబరువును కొం
తదూరము మోయుటయు ముసురు పట్టిన దిన
ములలో పథికులను సత్రమునకుఁ గాని స్వగృహ
మునకుఁ గాని దీసికొని వెళ్ళి తగిన వసతుల నమర్చి
సేవఁ జేయుచుండెను. తీర్థయాత్రాపరుల పథశ్రమ
నివారణార్థము వేడినీళ్ళు కాచి వారి పాదములఁ
గడగి కాళ్ళు పట్టుచుండెను. అన్నాతురు లయిన
బీదలకు ఇల్లిల్లుదిరిగి అన్నమును దెచ్చి పెట్టుటయు
నీరుదొరకని పశువులకు నీరుపోయుటయు మేత
దొరకని పశువులకు మేతవేయుటయు నెయ్యి

గోధుమపిండి మొదలగువానిని చీమల పుట్టలకడఁ
జల్లుటయు మొదలగు విశ్వ సేవాకార్యములను
శక్తివంచనలేక చేయుచు విశ్వేశ్వరునకు ప్రత్యక్ష
ముగ సేవఁజేయు భాగ్యమబ్బిన దని పరమా
నంద మగ్నుఁడై యుండెను.

ఇట్లు తుకారాముఁడు విశ్వసేవావ్రత దీక్షయం
దుండ నొకానొక దినమునందు ఒక వృద్ధాంగన
చేతకఱ్ఱపై శరీరభారము నిడికొని నడువనేరక
మెల్లమెల్లగ నడుగులిడుచు దుకాణమున కేగుచుం
డెను. దయార్ద్రచిత్తుఁడగు తుకారాముఁడా
వృద్ధస్త్రీని జూచి "అమ్మా, నీవు కడు డస్సి
యున్నావు. కావున నా వీపుపై నెక్కుము.
నిన్ను బజారునకు దీసికొని వెళ్లుదును" అని
నుడువుచున్న తుకారాముని జూచి వృద్ధస్త్రీ
యిట్లనియెను. "నాయనా! నన్ను మోసికొని
వెళ్లుట కష్టము. కాబట్టి ఈముదుసలిపైఁ గరు
ణించి బజారునకేగి యీపాత్రతో నూనెఁ దీసి
కొని మాయింటికి రమ్ము. నీవు వచ్చునంతలో

నెమ్మదిగ నేనింటి కేగుదును." అను పలుకు లాలించి వృద్ధస్త్రీ చేతనున్న పాత్రను దీసికొని బజారున కేగి నూనెఁ దీసికొని వచ్చి యామె కిచ్చెను. ఈకార్యము జరిగిన కొన్ని దినములకు తుకారాముని సద్భావమును వెల్లడించుటకుఁ గాను ఆవృద్ధాంగన ఇరుగు పొరుగిండ్ల వారితో తుకారాముఁడు తెచ్చి యిచ్చిన నూనెఁ చాల దినములవఱకు తఱుఁగక నే యుండెనని చెప్పెను. ఆమాటల వినిన స్త్రీ పురుషులు తుకారాముని నూనెఁ దెచ్చి పెట్టుమని ఆజ్ఞాపింప సాగిరి. సరళ స్వభావుఁడగు తుకారాముఁడు మాఱుమాటాడక నూనె దెచ్చి యిచ్చుచుండెను. కాని యీ కార్యము నిత్యకృత్య మయ్యెను. వ్యయము లేక ధర్మసీమఁడగు భృత్యుఁడు దొరకుటవలన నిచ్చ వచ్చిన పనులయం దీతని నియోగించుట కెవ్వ రును వెనుకంజ వేయరైరి. తుకారాముఁడు చేతనైనంత వఱకు జీవకోటి సేవఁజేయుట వలన అలసి రాత్రులు దేవళమున కేఁగి అందుండు

శ్యామ సుందర మూర్తిని సందర్శించి పరమప్రీతి
నంది నృత్యముఁ జేయుచు కీర్తనలను బాడుచుం
డెడి వాఁడు. ఆత్మాభిమాన శూన్యుఁడగు తుకా
రాముఁడు దేహూ గ్రామవాసులు చెప్పు కార్య
ములను సంతసమునఁ జేయుచు తన విశ్వసేవా
వ్రతము సాగుచున్నందుల కెంతయు సంతసిం
చుచు విశ్వేశ్వరుని కొనియాడుచుండెను. కాని
ఈకార్యములకు జిజీబాయి సహింపఁజాలదయ్యె.
ఆరోగ్యవంతులును, దార్ఢ్యము గలవారును కూడ
వ్యయము లేని భృత్యుఁడు లభించెఁ గదా యని,
భర్తచేత, బండ చాకిరిని జేయించుటను జూచి
పతివ్రతయగు నే స్త్రీ సహించియుండఁ గలదు?

నామదేవుఁడు రచించిన అభంగములు తుకా
రాముని ధర్మజీవన వికాసమునకు మిక్కిలి సహ
కారము లయ్యెను. ఆషాఢ కార్తీక మాసము
లలో పండరిపురమున కేగునప్పుడు నామదేవ
విరచితములగు అభంగములను బాడుచు మైమఱచి
మార్గమధ్యమునం దొకనాఁడు నిద్రించుచుండఁగా

స్వప్నమునందు నామదేవుని వెంటనిడుకొని విఠో బాదేవుఁడు ప్రత్యక్షమై తుకారామునితో "నా ప్రియభక్తుఁడగు నామదేవుఁడు రచియింప వలయునని సంకల్పించుకొనిన అభంగములలో కొన్నిఁటిని మాత్రమే రచియించియుండెను. కావున మిగత అభంగములను నీవు పూర్తి చేయుము. నీకు నేను జ్ఞానమును ప్రసాదించియు న్నాను. నాప్రసాదవాణిని ప్రచారముచేసి మానవ సంఘము నుద్ధరించుటకుఁ గారకుఁడవుగమ్ము" అని చెప్పి విఠోబాయంతర్హితుఁడైనతోడనే యీ తనికి నిద్రాభంగమయ్యెను. సంపూర్ణముగ భగ వానునకాత్మ సమర్పణముచేయువారలకు ప్రత్యే కముగ స్వతంత్రమనునదియుండదు. కనుక నట్టి వారలు తాముచేయుకార్యములన్నియు నీశ్వర ప్రేరితములని విశ్వసించి ప్రవర్తించుచుందురు. జాగ్రదావస్థయందే యిట్లు దలంచి ప్రవర్తించు చుండునప్పుడు స్వప్నావస్థలలోని చింతలు భగవ త్ప్రేరితములని భావించుటయం దాశ్చర్యమే

మున్నది? కనుకనె స్వప్నదృష్టి ఘటనను తుకారాముఁడీశ్వర విధానమని విశ్వసించి ప్రప్రథమమున శ్రీకృష్ణుని బాల్యలీలలను గుఱించి యొక గ్రంథమును రచియించెను

సంకీర్తన సమయమున భక్తులతోఁగూడి అభంగములఁ బాడుచుండు నప్పుడు భావపరవశుఁడగు తుకారాముని ముఖవినిసృతములై అభంగము లనేకములు వచ్చుచుండెను. సముద్రతరంగములవలె పొరలిపొరలివచ్చు భావమయకవిత్వముతోఁ గూడిన అభంగములు శ్రోతలను అమృతవారాసియందు ముంచి తేల్చుచుండెను. వినువారలు విస్మయచిత్తులై తుకారాముని ఈశ్వరాంశసంభూతునిగ భావించుచుండిరి. కుటిలస్వభావులును ధర్మద్వేషులును మొదలుగాఁగలవారలుగూడ భావమయమగు నీయన అభంగములను విని యాత్మవిస్మృతు లగుచుండెడి వారనునప్పుడు తుకారాముని సంకీర్తనయందుఁ గల మోహినీశక్తిని వర్ణించుట కెవరితరమగును? దినములవరు

సేను జనులు గుంపులు గుంపులుగ వచ్చి తుకా రాముని సంకీర్తలయందు నామరసమును గ్రోలు చుండిరి. తుకారాముని పిచ్చివానిగఁదలంచుచుం డిన వారిప్పుడీయనను మహాభక్తునిగఁ దలంప సాగిరి. తుకారాముని కీర్తనలు నలుదిక్కుల వ్యాపించిన కొలఁదిని తీర్థయాత్రలకేగుప్రజలవలె దూరప్రదేశములనుండి గూడ జనులు గుంపులు గుంపులుగ వచ్చి సంకీర్తనను వినుచుండిరి.

ఇంతకుపూర్వము తుకారాముఁడు సంసార మునువిడిచి నిర్జనమునకేగి తపస్సుచేసికొనవల యునను సంకల్పమున నుండెను. ఇపుడు సంసార ము నందుండి లోకహితమగు కార్యములను జేయ వచ్చునను దలంపున సంసారమును విడనాడవల యునను సంకల్పమును మానుకొనెను. గృహస్థా శ్రమ పక్షపాతియైనంత మాత్రమున తుకారా ముఁడు సంసారమునందే మునిఁగియుండెనని భావిం పఁ జనదు. అర్థోపార్జనకనుగుణమగు శక్తిప్రవృ త్తు లనేకదినములకు పూర్వమే ఈయనను విడ

నాశీయుండెను. ఇందువలన జిజీబాయియే సంసా
రభారమును భరింపవలసిన దాయెను. మహీపతి
ఈమెనామమును జేర్కొనిన స్థలములనన్నిటను
ఈమెను తిట్టుబోతనియు, మూర్ఖురాలనియు
వ్రాసియున్నాఁడు. సాధారణముగ మహాపురుషు
లంకో(బోల్చి వారిభార్యలగుణములను విచారించు
టకుఁ బ్రారంభింతురేగాని మహాపురుషుల భార్య
లను సామాన్య యుత్తమాంగనలతోఁ బోల్చి
విమర్శించుటకుఁ బ్రయత్నింపరు. ఇందువలన వీరి
యందనేక లోపములు గానిపించుచుండును. పరి
మిత బుద్ధి వికాసముగల సాధారణ యుత్తమాం
గనలపైని గురుతరాపరాధమును మోపుటభావ్య
ముగాదు. కావున జిజీబాయినిగూర్చి యించుక
విచారించెదము.

ఈమె సంపన్న గృహస్థునియింట పుట్టి పెరిగి
అట్టివానికికోడలై యుండుటయేగాక దాంపత్య
సుఖమునం దోలలాడుచుండెను. సంపన్నగృహ
స్థోచిత లక్షణముల ప్రకారము ప్రవర్తించుచు

హాకస్మికముగ ఘోరతర దరిద్ర దవానలమునం దగుల్కొనెను. ఇందువలన నప్పుడప్పుడు ఉపవాసములు చేయుచుండ వలసినదాయెను. ఇట్టి కష్టములయందు దసహిష్ణుత ప్రకాశమానమగుట సామాన్యుల పక్షమున వింత కాదుగదా? జిజీబాయి తనభర్తయజాగ్రతవలననే తాను దరిద్ర దేవత పాల్పడవలసివచ్చెనని విశ్వసించియుండెను. ఈస్థితియందు దంపతులమధ్య కలహము సంభవించుట వింతగాదు. ఈదరిద్రమునకు తోడుగ సంసార కార్యములయందు విముఖుండై అహోరాత్రు లాధ్యాత్మిక తత్త్వమును పరిశీలించుచుండు నట్టి భర్తనుజూచి ఎంతమంది స్త్రీలహృదయములు కోమలములుగ నుండునో విచారింపుడు! ఈస్థితియందు తుకారాముడు చేయుకార్యము లతి సాహసముతో గూడుకొనినవై యుండెను. దయార్ద్రచిత్తుడగు తుకారాముం డొకానొకదినమున వస్త్రహీనుడగు కడుబీదవానిని జూచి స్నానమునకేగినభార్య కట్టుబట్టను దెచ్చి బీదవాని

కిచ్చి విఠోబాకు వస్త్రమును సమర్పించితినని సంతసించెను. కట్టుకొనుటకు మిగిలియున్న యేక వస్త్రమునుగూడ బోయినప్పుడు మునిజనోచిత సహిష్ణుత లేనియెడల సంసారమునందు శాంతి యుండుట దుర్లభముగదా? జిజీబాయి మధ్యాహ్నమువఱకు కష్టించి పరివారమునకు ప్రాణములు నిలచుటకు సరిపోవు పదార్థములను దెచ్చి వండియుంచు నప్పటికి తుకారాముఁడు నలుగురయిదుగురిని వెంటనిడికొని వచ్చుచుండెను. అందువలన పచనముచేసిన పదార్థములను అతిథులకును భర్తకును బెట్టి పరివారమంతయు ఉపవసింపవలసి వచ్చుచుండెను. యుక్తాయుక్తజ్ఞానములేని పిచ్చివాఁడని తనభర్తనులోకులు పరిహసించుటనుజూచి ఈమె సహింపఁజాల కుండెను. జిజీబాయిపుట్టినింట భవానీపూజ చేయుచుండెడిది. ఇందువలన నత్తవారింటిలోని విఠోబాదేవుని పూజయందంత అనురాగము లేకుండెను. విఠోబాదేవుని భక్తివలన తుకారామున కీయవస్థపట్టెన

దని లోకులు చెప్పునప్పు డా పలుకులను విశ్వసించి
విఠోబా సేవ మానుమని భర్తతోఁ జెప్పుట సామా
న్యస్త్రీలపక్షమున వింతకాదుగదా? ఈకారణము
వలన అపుడపుడు భార్యాభర్తలకు కలహము
సంభవించుచుండెడిది. కలహము సంభవించి
నప్పుడు తుకారాముఁడు మాఱుమాటాడక పలా
యితుఁడగు చుండెడివాఁడు. భార్యకోపము చల్లా
రిన తరువాత గృహమునకు వచ్చుచుండెను.
జిజీబాయి కోపస్వభావముగలది యైనను పతిభ
క్తియను మహాగుణము ఈమెనాశ్రయించియుం
డెను. ఇందువలన భర్త భుజింపనిది తాను భుజిం
చునది గాదు. తుకారాముఁడు గృహమును విడిచి
వెళ్ళుట తటస్థించినయెడల తిరిగివచ్చుపర్యంతము
ఈమె యుపవాసములు చేయుచుండెను. కాన
తుకారాముని వెదకి తీసికొనివచ్చి భోజనము బెట్టి
భర్తయుచ్ఛిష్ట పాత్రయందు దాను భుజించుచుం
డెడిది. తుకారాముఁడు భాస్వానాథ పర్వతము
మీఁద నివసించునప్పుడు భోజనమును దీసికొని ఈ

మువెళ్ళుచుండెను. ఒకానొక దినమునందన్నము దీసికొని వెళ్లుచు నెండతాకుడు వలన జిజీబాయి మార్గమధ్యమునందు పడిపోయెను. ఈదురవస్థనుజూచి నప్పటినుండి తుకారాముఁడు దేహూగ్రామమునందే నివసించుచుండెను. జిజీబాయి తిట్టుబోతయనియు మూర్ఖురాలనియు మహీపతి వ్రాసియున్నను సంసార కర్తవ్యములయందు తప్పులను జూపించినవాఁడు గాఁడు. జిజీబాయి ప్రత్యక్షమునకాకున్నను పరోక్షమున నిజస్కంధమున సంసారభారమును వహించి, ఆర్థిక చింతనుండి భర్తను నివృత్తునిగ నొనర్చి సహధర్మిణీ కర్తవ్యమును నిర్వహించెను. ఇందువలన నీమెయుత్తమరాలనియు, పతిభక్తిపరాయణ యనియుఁ జెప్పుటకు సందియము లేదు గదా ?



# అయిదవ ప్రకరణము



తుకారాముని భగవద్భక్తి నలుదిశల వ్యాపించినకొలఁదిని ఆతని మృదుమధురమగు ధర్మోపన్యాసములతోఁగూడిన హరికథలను వినుటకు వేలకొలఁదిజనులు వచ్చుచుండిరని వెనుకటి ప్రకరణమున వివరింపఁబడినది. బ్రాహ్మణులు గూడ తుకారామునకు నమస్కరించుచు ఈయన యమూల్య ధర్మోపన్యాసములను వినినకొలఁదిని శిష్యులగుచుండిరి. గంగాధరపంతను బ్రాహ్మణుఁడును సంభాజియను దెలుకులవాఁడును తుకారాముని శిష్యవర్గమునందు ప్రధానులు. తుకారాముని ముఖవినిస్సృతకవిత్వము నెప్పటికప్పుడు గంగాధరపంతు వ్రాయుచుండెను. తుకారాముని గౌరవ ప్రతిష్ఠలు వృద్ధియైనకొలఁదిని తత్కాలమందలి భక్తులకీయనమీఁద అసూయ వృద్ధికాఁజొచ్చెను.

ఈయన కీర్తివ్యాపించిన కొలందిని తమశిష్యసమూహము తఱుఁగుననియు తమగౌరవ ప్రతిష్ఠలు నశించుననియుఁ దలంచి అసూయాగ్రస్తులై యనేకులు శత్రుత్వమునకుఁ బూనుకొనిరి. అట్టివారిలో ప్రథముడు "మాస్వాజిబాబా" యనుసాధువు. ఈయన దేహూగ్రామము నందొక మఠమును కట్టించి యందు నివసించుచుండెను. ఈయనను లోకులు మహాపురుషుఁడని తలంచు చుండిరి. క్రమక్రమముగ తుకారాముని సంకీర్తనలవలన నాకర్షింపఁబడి శిష్యులు తనచుట్టుఁజేరకుండుటకు వగచి మాస్వాజీ క్రోధాన్వితుఁడై తుకారాముని సాధించుటకు వేచియుండెను. ఇట్లుండ నొకానొకదినమున తుకారామునిగేదె విఠోబాదేవళము నానుకొనియుండిన మాస్వాజితోటలోఁ జొరఁబడి పూలచెట్లను దినెను. ఇందువలన మాస్వాజీ ఆగ్రహాగ్రస్తుఁడై తుకారాముని దిట్టసాగెను. కానితుకారాముఁడచ్చట లేఁడు. ఇదిజరిగిన కొన్నిదినములకు మాస్వాజి యాగ్రహామునకు తుకా

రాముఁడు లోఁబడవలసినవాఁ డాయెను. ఒకా నొక యేకాదశి సాయంసమయమున విఠోబాను దర్శించుటకును, సంకీర్తనవినుటకును, దూరప్రదే శములనుండి జనులు గుంపులు గుంపులుగ వచ్చు చుండిరి. మాన్వాజి తనకోఁటచుట్టు దట్టముగను విశాలముగను ముండ్లకంచెను వేయించెను. ఈ కంచె విఠోబామందిరమునకు సమీపమందుం డుటవలన ప్రదక్షిణము చేయునప్పుడు భక్తులపా దములకు ముండ్లు గ్రుచ్చుకొను ననుతలంపున కంచెను దీసివైచి రాలినముండ్లను తుకారాముఁ డూడ్చుచుండెను. సమయమునకు వేచియున్న మాన్వాజి కోఁటచుట్టువేసిన కంచెను దీసివైచి ఊడ్చుచున్న తుకారామునిజూచి యగ్నిహో త్రమునం దాజ్యముపోసినట్లు మండిపడినవాఁడై పరుగిడుచువచ్చి ముండ్లమండతోడ పది పదునై దుదెబ్బల నీయన వీపుపైఁగొట్టి తిట్టుచు మఠమున కేగెను. తుకారాముఁడు విఠోబా పాదపద్మముల యందు మనస్సిడి హరి నామస్మరణము చేయుచు

నిశ్శబ్దముగ దెబ్బలను సహించి వీపునఁగ్రుచ్చుకో
నిన ముండ్లను దీసికొనవలయుననియైన దలంపక
విఠోబామందిరమును బ్రవేశించి దేవునిపాదము
లపైఁబడి యేడ్చుచు తనకష్టములను జెప్పుకొనెను.
ఈయనదురవస్థను జూచుచున్నవారలు మాస్వా
జి శాపము బెట్టునను భయమువలన మాఱుమా
టాడక కనులనీళ్ళు కనులగ్రుక్కుకొని చూచు
చుండిరి. మహాభక్తుఁడగు త్యాగరాజస్వామి విర
చితమైన కృతులాయన జీవితఘటనలను దెలుపు
విధముననే, తుకారాముని అభంగము లాయనజీ
విత ఘటనలను దెలుపుచుండును. ఈఘటనా
సంబంధమునందు తుకారాముఁడు చెప్పిన ఆను
అభంగములలో నొకయభంగ మీభావము గలిగి
యున్నది. "ఓభగవానుఁడా? దుర్జనుల సహవాస
మువలన సాధుపురుషుల మానసిక శాంతి దూరమ
గునని తెలిసికొనఁగలందులకు గాను నాకీశిక్షను
విధించి యున్నావు. ఇంతటినుండియు దుర్జనులకు
దూరమందుండఁ బ్రయత్నింతును" కఠోరసంయ

మము ద్వారా మనోశరీరములను వశపఱచుకొని యున్న తుకారాముఁడు శత్రువుగొట్టు దెబ్బలను నీరవముగ సహించి యింద్రియనిగ్రహుఁడయ్యెను. గృహమునకేఁగఁగనే జిజీబాయి తుకారాముని శరీరముఁజూచి దుఃఖించి గ్రుచ్చుకొనినముండ్లను బెఱికి శుశ్రూషఁ జేయఁగా, కొంతవడికి తుకారాముఁడు స్వస్థతఁజెందెను. సంకీర్తనకుఁగావలసిన పదార్థములన్నియు సిద్ధమయ్యెను. ప్రతి సంకీర్తనకువచ్చు మాస్వాజిసిగ్గుపడి ఆదినమున రాఁడయ్యెను. అందువలన తుకారాముఁడు మాస్వాజీని బిలుచుకొనివచ్చుటకు తనశిష్యులను బంపఁగా సర్వాంగములు వేదనతోఁగూడుకొని యుండుటవలన రాఁజాలనని మాస్వాజి చెప్పిపంపిన నుడువులనాలించి తుకారాముఁడాయనమఠమున కేఁగి సాష్టాంగనమస్కారమొనర్చి యిట్లనియెను. "స్వహస్తముతోఁ నన్ను గొట్టుటవలన ప్రభువుల యొక్క సర్వాంగములు వేదనతోఁగూడుకొని యున్నవి. తోఁటచుట్టు వేయించిన మీకంచెనుపె

కల్పించి మీకాగ్రహమును గలిగించిన నన్ను మ
న్నించి ప్రేమపురస్సరముగ సంకీర్తనాస్థలమునకు
విచ్చేయవలయునని ప్రార్థించుచున్నాను." అని చె
ప్పుచు మాన్వాజశరీరమును బట్టుటకుఁ బ్రారంభిం
చెను. ఈకార్యమువలన మాన్వాజి లజ్జితుఁడై
తుకారామునితోఁగూడి సంకీర్తనాస్థలమునకు
వచ్చెను. గతరాత్రి యీయనగేదెను దొంగిలిం
చుకొని వెళ్లిన దొంగలేదియో యొకయలౌకిక
క్రియాసందర్శనమువలన భీతులై గేదెనుదోలు
కొని సంకీర్తనాస్థలమునకువచ్చి తుకారాముని
శరణుఁజొచ్చిరి. అంత తుకారాముఁడు దొంగల
వంకఁజూచి గేదెకావలసియుండిన తోలుకొని
పొండు. కాని దొంగతనముచేయుట మహాపాతక
మని చెప్పి దొంగలను బంపివేసెను. ఈఘటనను
ప్రత్యక్షముగఁజూచిన మాన్వాజి ఈయన యసా
ధారణమహాత్వమునకు ముగ్ధుఁడై వైరభావము
ను విడనాడి తుకారామునితోఁ బ్రీతి మెయి మె
లఁగుచుండెను.

ఎటువంటి భక్తుఁడైనను గురూపదేశమును బొందనిది ధర్మరాజ్యమునందు ప్రవేశించుటకు వీలులేదని భారతీయుల విశ్వాసము. ఈవిశ్వాసానుసారముగనే ఆజన్మతపస్వియగు ధృవుఁడు ప్రప్రథమమున నారదునివలన మంత్రోపదేశమును బొందినటులు పురాణములయందు వర్ణించి యున్నారు. సహిష్ణుత, కఠోరసంయమము మొదలగు గుణముల నార్జించియున్న తుకారామునకు స్వప్నమునందు విఠోబాదేవుఁడు స్వయముగ మంత్రోపదేశమును జేసెనని వ్రాసిన చరిత్రకారులలో మహీపతి ఈవిధముగ వర్ణించియున్నాఁడు. తుకారాముఁడు పండరిపురనాథుని ధ్యానించుచు నిద్రఁబోయెను. స్వప్నమునందు చంద్రభాగా నదీజలముల స్నానమాడి విఠోబా మందిరమునకువచ్చుచు ఆమార్గముననే యేగుచుండిన యొకవృద్ధబ్రాహ్మణునిజూచి యభ్యాసానుసారముగ తుకారాముఁడాయనకు సాష్టాంగ వందప్రణామంబొనర్చెను. ఆయన తుకారా

ముని తలపైఁ జేయిడి లేవదీసి కూర్చుండఁబెట్టి "రామ, కృష్ణ, హరి" అనుమంత్రము నుపదేశించి రాఘవచైతన్యులశిష్యులు కేశవచైతన్యులనియును, కేశవచైతన్యులు తనకు గురువులనియును, తనపేరు బాబాజీచైతన్యుఁ డనిచెప్పి పాండురంగనాథుని విడువకుండినయెడల ముక్తినొందెదవని నుడివెను. ఈనుడువు లాలించి తుకారాముఁడు పరమప్రీతినొంది తిరిగి సాష్టాంగదండప్రణామం బొనర్చి ఈదినమున మాగృహమును పవిత్రముచేయవలయునని ప్రార్థించెను. బ్రాహ్మణుఁ డాప్రార్థనను విని తుకారాముని గృహమునకు విచ్చేసెను. అతిథిని వెంటనిడుకొని వచ్చిన తుకారామునితో జిజీబాయి పోట్లాడుటకు ప్రారంభించి నందువలన, బ్రాహ్మణుఁ డంతర్థానమయ్యెను. అంతట తుకారాము మేల్కొనియెను."

పగలు యోజించు యోజనలు రాత్రులు స్వప్నములయందు ప్రత్యక్షమగుట సర్వసాధా

రణ విషయముగదా? అతిథి యభ్యాగతుల సేవావిషయమున భార్యాభర్తలకు తఱుచుగా కలహము జరుగుచుండుటచేత తుకారామునకు మిక్కుటమగు మనోవ్యథ గలుగుచుండెను. ఈ యన స్వప్నదృష్టబ్రాహ్మణుని దలంచుకొని స్వప్నమందును మనోశాంతి లేనందులకు చింతించి సంసారమును పరిత్యజించుటయే యుత్తమమని దలంచుకొని "బొల్లాంల" అను పేరుగల యరణ్యమున కేగెను. ఆయరణ్యమునుండివచ్చి ప్రతిదిన ప్రాతఃకాలమునం దింద్రాణీనదీజలముల స్నానమాడి విఠోబాదేవళమునకు వచ్చి పూజచేసి మఱల యరణ్యమున కేగుచుండెడివాఁడు. ఇప్పటికీయన జనసంఘమునందు మహాభక్తుఁడని పరిగణింపఁబడుచున్నందున జనులాహారద్రవ్యములను దీసికొని వెళ్లి తుకారామునకిచ్చి వచ్చుచుండిరి. కాని ఆహారము లభింపని దినముల యందుపవాసము చేయుచుండెను. దాదాపు రెండు నెలలీవిధముగ జరిగిన పిమ్మట

యొకనాఁ డింద్రాణీ నదీజలముల స్నానమాడు
సమయమున జిజీబాయి వచ్చి తుకారాముని
చేలాంచలముఁ బట్టుకొని యిట్లనియెను. "మమ్ము
విడనాఁడి రెండు మాసములుగ మీరరణ్యా
వాసము చేయుచున్నారు. మాసంగతియే మీ
మనమునం దున్నటులు దోఁపదు. కనుక మే
మెట్లు జీవింపఁ గలుగుదుము?" అను జిజీబాయి
మాటలు విని "విఠోబాయు రుక్మిణియు సమస్త
జగత్తునకుఁ దలిదండ్రులు కావున నీవు వారి
శరణుఁ జొరుము. నీ యభావములన్నియు
ప్రాప్తియగును" అనిచెప్పెను. ఆపలుకులు విని
తుకారాముని వంకఁజూచి జిజీబాయి దీనస్వర
మున నిట్లు విన్నవించుకొనియెను. "నే నెప్పుడును
మీధర్మకార్యములకు వ్యాఘాతము గలిగింపను
కావున గృహమునకువచ్చి మీచిత్తానుసారముగ
హరిభజనను జేసికొనుచుండుఁడు." అను ప్రార్థన
కంగీకరించి తుకారాముఁడు స్వగృహమున
కేగెను.

తుకారాముఁడు స్వగృహమున కేగి ప్రాంగణ
మునందలి తులసిమండపముమీఁద గూర్చొని హరి
భజనఁ జేసికొనుచు ధర్మోపదేశములను జేయుచు
హరికథలను జెప్పుచుండెను. సమయము దట్టిం
చినపుడెల్ల అర్ధాంగికి భక్తితత్త్వమును బోధించి
మననముచేయవలయునని ప్రోత్సాహపఱచుచుం
డెను. కాని తుకారాముని దర్శనార్థము వచ్చుజను
లచే గృహము నిండియుండుటను జూచి అప్పుడప్పుడు
జిజీబాయి చిరాకుపడుచుండుటచేత నామెకు
"పూర్ణబోధ" యనిపిలువఁబడు పదునొకండు అ
భంగములతోడ ధర్మోపదేశమును జేసెను. ఆయ
భంగములలో నొకదాని తాత్పర్యమిక్రింద నుద
హరించుచున్నాను. "విఠోబాసేవఁ జేయుచుండుట
వలన సమస్తమానవులును మనకు బంధువులైరి.
స్వకార్యములను పరిత్యజించి దూరదేశములనుండి
గూడ మనయింటికి వేనవేలుగ జనులువచ్చుటకు
కారణము విఠోబానామామృతమును గ్రోలుట
కుకదా? అట్టివారియెడల నీవు పరమప్రీతిని జూ

పింపవలదా? పుత్రికాపుత్రుల విషయమున నీకింత చింతయేల? జగద్రక్షకుఁడగు విఠోబాపైన భారముంచి మెలఁగుచుండిన యెడల నీకేవిధమగు లోపములుఁ బొడగట్టవు. సంసారముమీఁద మమతయున్నంత కాలమును హరిభక్తిలభించుట దుర్లభము. రేపుశుభదినముగాన చిత్తమును విఠోబాచరణకమలములయం దర్పించి గృహమునందున్న సమస్తవస్తువులను బ్రాహ్మణులకు సమర్పించి దాసురాలవై అనన్యచిత్తమున భగవద్భక్తులశరణుఁజొరుము. భక్తులసేవయందు నిమగ్నురాలవై భావిచింతనుండి విముక్తినొందుము. క్షణభంగురమగు ఇహసౌఖ్యముల పరిత్యజించి విఠోబానామామృతమును గ్రోలుచున్న యెడల పరమానందమును బొందుదువు." ఈయుపదేశమును జిజీబాయివిని మఱుదిన ముదయమున సర్వస్వమును బ్రాహ్మణులకర్పించుట కంగీకరించెను. మఱుదినము గృహమునందుండు సమస్తవస్తువుల ను దానముచేయుటకు మొదలిడిచివఱకు భోజన

పాత్రలనుగూడ నీతఁడుపంచిపెట్టెను. సర్వస్వ
ము వితరణఁజేసిన పిదప నొకబీదస్త్రీ యొక
వస్త్రమిమ్మని తుకారామునిప్రార్థించెను. అంతట
నీయన జిజీబాయికట్టుకొనుటకు మిగిలియున్న చిరు
గులచీర నొక్కదానినిదెచ్చి యాస్త్రీకిదానముఁ
జేసెను. జిజీబాయి అంతవఱకును గంభీరముగఁ
జూచుచుండెనుగాని లజ్జానివారణార్థము మిగిలి
యున్న యొకచిరుగులచీరయుఁ బోవుటవలన
ధైర్యచ్యుతయై తుకారామునిఁదూలనాడెను. జిజీ
బాయిని తిట్టుబోతనియును మూర్ఖురాలనియును
నిర్ధారణఁజేయునప్పుడు ఆమెయెటువంటి కఠినపరీ
క్షలయందు పరీక్షింపఁబడుచుండెనో గమనించుట
యత్యావశ్యకము.

తుకారామునకు కాశీ, భాగీరథీ, గంగయను
ముగ్గురు కొమార్తెలును మహాదేవుఁడు, విఠోబా
యను ఇద్దఱుపుత్రులునుండిరి. వివాహమునకు
తగినవయస్సువచ్చినందువలన పెద్దకొమార్తెకు
తగినసంబంధము విచారింపుఁడని జిజీబాయితొంద

రం బెట్టసాగెను. ఒకానొకశుభదినమున తుకా రాముఁడు రాజవీథిలోనికరిగి అచ్చటనాడుకొను చుండిన ముగ్గురుస్వజాతిబాలురను వెంటనిడుకొని వచ్చి మువ్వురకు మువ్వురుపుత్రికలనిచ్చి వివా హమొనర్చెను. కాని అల్లుండ్రను సత్కరించు టకు ధనమెక్కడ! అందువలన నల్లుండ్రకు జొన్న బియ్యపురొట్టెను మాత్రము భోజనమునకు మారుగ బెట్టెను. మఱుదినమునం దీసమాచా రము వరులతలిదండ్రులకు తెలిసి తుకారాముని వంటి మహాభక్తునితోడ సంబంధముగలియుట కెంతయు సంతసించిరి.

తుకారాము రచియించిన "ఉత్తమజ్ఞాన ము" అనఁబడు పదునొకండభంగము లీసందర్భ మునఁ జెప్పబడినవను వాడుకగలదు. ఒకానొక జ్ఞానపిపాసియగు బ్రాహ్మణుఁడు పండరిపురనా థుని శరణుఁజొచ్చియుండెను. ఇట్లుండ కొంత కాలమునకు విఠోబాదేవుని యాదేశ ప్రకా రము జ్ఞానేశ్వరుని సమాధియొద్ద కేగి ఆరా

ధనఁ జేయుచుండఁగా నచ్చటనైన యీ దేశప్ర
కార మా బ్రాహ్మణుఁడు దేహూ గ్రామమునకు
వచ్చి తుకారాముని ఆశ్రయించెను. అప్పుడు
తుకారాముఁడు "ఉత్తమజ్ఞానము"ను పదునొకండ
భంగములను, భగవత్ప్రసాదమగు నొకనారి
కేళఫలమును, బ్రాహ్మణునకొసంగెను. దేవభాష
యగు సంస్కృతమందు గాక దేశభాషయగు
మహారాష్ట్రభాషయం దభంగములుండుటచేత
జ్ఞానాభిమానియగు బ్రాహ్మణునకా యభంగ
ములు రుచింపనందువలన ఆ యభంగములను
నారికేళఫలమును అచ్చటనే దిగవిడిచిఆయన తిరిగి
జ్ఞానేశ్వరునియొద్దకేగెను. ఈ బ్రాహ్మణుఁడేగిన
కొండొకవడికి ఖండోబాయను బ్రాహ్మణుఁడు
ధర్మోపదేశముల నాకర్ణించుటకుగాను తుకారా
ముని యొద్దకువచ్చి బ్రాహ్మణునిచే విడువఁబడిన
యభంగములను నారికేళఫలమును గైకొనెను.
అప్పటినుండియు నాయనధర్మభావము వికసింప
నారంభించెనని చెప్పుదురు.

ఈనారికేళఫలమునుగూర్చి యింకొక వాడుక గలదు. "ఓకానొకధనికుఁడు తన కార్యసిద్ధియైనచో జ్ఞానేశ్వరునకు విస్తారధనమును చెల్లింతునని మ్రొక్కుకొనెను. కార్యసిద్ధియైన పిమ్మట జ్ఞానేశ్వరుని యాదేశానుసార మాధనము తుకారామునకు సమర్పింపవలసియుండెను. కాని తుకారాముఁడుధనమును స్వీకరింపఁడను తలంపున ఆధనికుఁడు ముత్యములు వజ్రములు మొదలగునవి లోపలనిమిడ్చిన నారికేళఫలమును తుకారామునకు సమర్పించుకొనెను. ఆనారికేళఫలమునే ఈశ్వరప్రసాదమని తుకారాముఁడు బ్రాహ్మణున కొసంగెను. కాని చివఱకది ఖండోబాయను బ్రాహ్మణునకుదక్కెను. దీనిని ఖండోబా పగులఁగొట్టి యందున్న ముత్యములను రత్నములను చూచి తుకారాముని మహాత్మ్యమువలన లభించెనని సంతసించెను." ఈఘటనవలన తుకారాముని కీర్తిదేశ దేశములయందెవిధముగ వ్యాపించెనో చదువరులే గ్రహింపెదరు గాక !



# ఆఱవ ప్రకరణము.

---

తుకారాముని యొద్ద భక్తిరసమును గ్రోలనారం
భించినవారలు తమనుధన్యులుగ నొనర్పుమని ఈ
యనను ప్రార్థింపసాగిరి. అందువలన ఇతఁడు హరినా
మామృతమును సమస్తజనులకు వితరణచేయఁగ
లందులకుఁగాను చుట్టుపట్లగ్రామములకేగి హరి
కథలను జెప్పుట కుపక్రమించెను. క్రమక్రమముగ
ననేకు లీయన మార్గానువర్తు లగుచుండిరి. జను
లీయనమార్గావలంబనులైన కొలఁదిని ఈర్ష్యాప్ర
ధానులలో గొందఱు తుకారాముని కష్టపెట్టుట
కారంభించిరి. శూద్రకులసంజాతుఁడైన తుకారా
ముఁడు బ్రాహ్మణులకుఁగూడ ధర్మోపదేశములను
జేయుచున్నాఁడనియును, శాస్త్రమర్మము లంత్య
జాతులవారికిఁగూడ ప్రచారము చేయుచున్నాఁడ
నియును, మఱికొంద ఱాగ్రహగ్రస్తులగుటకు
కారణమైయుండెను. రాజమాన్యుఁడగు రామేశ్వ

రభట్టను పండితుఁ డాకాలమునందు సనాతనధర్మ రక్షకుఁడనుఖ్యాతిఁ గాంచియుండెను. ఈయన తుకారాముపదేశించు భక్తిధర్మం బంగీకరింపకుండుటయేగాక, సాధారణశాస్త్రాభిమానులగు పండితులవలెనే, ఈతఁడు మూఢుఁడనియు ధర్మోపదేశములఁ జేయుటకనర్హుఁడనియుఁ దలంచుచుఁ జిరకాలానుగతముగ బ్రాహ్మణులు చేయుచున్న ధర్మప్రచారమును తుకారాముఁడు చేయుచుండుట వలన క్రోధావేశపరవశుఁడై ఈతని నణఁగఁద్రొక్క ప్రయత్నమునకు సమకట్టెను. రామేశ్వరభట్టు ఒకానొకదినమున దేహూగ్రామాధికారి యొద్దకేగి యిట్లుచెప్పెను. "తుకారాముఁడు శూద్రకులసంజాతుఁడై యుండియు శ్రుతిమర్మములను ప్రచారముచేయుచున్నాఁడు. శాస్త్రానుసారమగు క్రియాకలాపముల కుత్సాహమియ్యక మధురమును మోహోత్పాతకమునైన సంగీతము ద్వారా సరళచిత్తులగులోకులను మతిభ్రష్టులుగ నొనర్చి బ్రాహ్మణుల నమస్కారములు గూడ

గైకొనుటకు జంకక నామమహిమను ప్రచారము చేయుచు భక్తిపదమును స్థాపింపఁ బ్రయత్నించు చున్నాఁడు. కావున ధర్మవిప్లవకారుఁడును బ్రాహ్మణవంచకుఁడును పాషండమతస్థాపకుఁడునగు తుకారాముని శిక్షించి ధర్మమును రక్షింపవలయును." అను వాక్యముల నాయధికారివిని తుకారాముని గ్రామమునుండి వెళ్లఁగొట్టవలయునని దేహూ గ్రామముయొక్క పటేలునకాజ్ఞ నొసంగెను. ఈ యాజ్ఞనువిని తుకారాముఁడు నిరుపాయుఁడై, విఠోబా దేవుని, పితృపితామహ వాసస్థలమును, విడనాడఁజాలక రామేశ్వరభట్టును శరణుఁజొచ్చుటకు నిశ్చయించుకొనెను. రామేశ్వరభట్టు సంధ్యావందనంబొనర్చుకొను సమయమున తుకారాముఁడేగి సాష్టాంగ దండప్రణామంబొనర్చి నామస్మరణఁ జేయుచుండెను. కాని రామేశ్వరభట్టు తుకారాముని చూచినంతటనే తోఁకద్రొక్కిన త్రాచువలె లేచి మండిపడుచు "తుకారాముఁడా? నీవు శూద్రుఁడవు. సంకీర్తనలయందు శ్రుతులలోని మర్మము

లను వెల్లడించుచున్నావు. ఇందువలన నీవును విను వారలును మహాపాతకమును బొందుదురు" అను నుడువ్రులాలించి తుకారాము విఠోబా ఆదేశానుసారమునఁ గవిత్వమును జెప్పుచున్నానని నుడివెను. తుకారాముని పల్కులవిని "వేదశాస్త్ర పురాణములయందు గొఱవడిన ధర్మము లుపదేశించుమని విఠోబా నీకాజ్ఞయొసంగినాఁడు కాబోలును! నీకవిత్వమువలన మహాపురుషుల యుపదేశములు నశించుకాల మాసన్నమైనది. లోకులు నీయభంగములలోని మృదుమధురరసము నాస్వాదించి పూర్వపురుషుల యుపదేశములు వినుటకు ప్రయత్నింపకున్నారు. ఇందువలన నుత్తమధర్మము లోపించునను సందియము కలుగుచున్నది. కావున నీవింతటినుండియు అభంగములఁ జెప్పఁజనదు" అను రామేశ్వరభట్టు వాక్యములను తుకారాముఁడు శిరస్సునధరించి యిట్లనియె. "ఇంతవఱకు నేనురచియించిన అభంగముల విషయమున తమ యాజ్ఞనువిన గోరుచున్నాను." అనుతుకారా

మునిప్రశ్నకు రామేశ్వరభట్టు అణుమాత్రమైనను యోజింపక ఆయభంగములన్నిటిని ఇంద్రాణీనది యందు పడవేయుమని చెప్పెను. హృదయభేదకములగు ఈపల్కులాలించి తల్లడిల్లుచు నోట మాటరాక కొంతవడికిఁ దెప్పిఱిల్లి తుకారాము స్వగృహమున కేగెను.

ఉత్కృష్టరచనయైనను నికృష్టరచనయైనను తామురచియించిన రచనమీఁద తమకు పుత్రవాత్సల్యమునకంటె వేయిమడుంగు లెక్కువ మమకారముండుట సహజముకదా! మఱియు తుకారాముఁడు ప్రఖ్యాతికొఱకుగాని ధనముననాశించిగాని అభంగములను రచియింపక తన ప్రాణముయొక్క నిగూఢాభిప్రాయములను ప్రాణేశ్వరునకు నివేదించుకొనుట కొఱకు వానిం జెప్పెను. కావున నీయభంగములే ఈయన సర్వస్వమైయుండెననుట యతిశయోక్తి కాదుకదా! బ్రాహ్మణుఁడు దేవతాస్వరూపుఁడను

నమ్మకముగల తుకారాముఁడు రామేశ్వరభట్టు నాజ్ఞకు మారాడక హృదయవేదనను బొందుచుఁ గన్నీరుమున్నీరుగ నేడ్చుచు, అభంగముల గ్రంథమును ఇంద్రాణీనదియందుఁ బడవైచుటకు సంసిద్ధుఁడై, విఠోబాదేవుని సంపత్తిని నదీజలముల విసర్జించి ఆయన దర్శనమున కెట్లేగఁగలనని తలంచి విఠోబా మందిరమును బ్రవేశించెను. నూతనాభంగముల రచననుగూడ నిషేధించుటవలన తుకారాముని దుఃఖమసహనీయ మయ్యెను. తల్లిఁగౌఁగిలించుకొని యేడ్చుశిశువువలె విఠోబాను కౌఁగలించుకొని యిట్లనియెను. "ప్రభో! నీవీజగత్తునకు కర్తవు. ఓవిఠోబా! నీకరుణాప్రసాదమువలన నేనీఅభంగములను రచియింపఁగలిగితిని. తిరుగ నీవే యాబ్రాహ్మణుని జిహ్వయందుండి అభంగములను ఇంద్రాణీజలములఁబడవేయునాజ్ఞ నొసంగి యున్నావు. కావున నీయాజ్ఞ నెరవేరునుగాక" అనుచు దేవళమునువిడిచి నదీతటమును జేరి జొటజొటరాలు కన్నీరు కాల్వలై పాఱ హరి

నామస్మరణఁ జేయుచు అభంగముల గ్రంథము నేక రాతికి గట్టిగాఁ గట్టి వస్త్రమును జుట్టి విడువఁజాలక విడువఁజాలక నదీజలమునవిడిచి రోదనముచేయుచుండెను. ఈయన యైహికసంపదనంతను విసర్జించినప్పు డణుమాత్రమైనను విచారమును బొందినవాఁడుకాఁడు. కాని అభంగముల నింద్రాణీనదీజలములకర్పించి మేరలేని హృదయవేదనఁ బొందుచు ఆహారపానీయముల వర్జించి విఠోబా మందిరమున కెదుటనుండు తులసికోటపైనబరుండి విఠోబాధ్యానమున నిమగ్నుఁడై యుండెను. ఈవిధముగ పదమూఁడుదినములు గడచిన తరువరి దేహూగ్రామవాసులలో కొందఱికి స్వప్నమందు విఠోబా ప్రత్యక్షుఁడై "తుకారాముని అభంగముల గ్రంథము ఇంద్రాణీనదియందు భద్రముగనున్నది. మీరు దానిని దెచ్చి తుకారామున కీయవలయును" అని చెప్పెనని కొందఱు చరిత్రకారులు వ్రాయుచున్నారు. మఱుసటిదిన ముదయమున నింద్రాణీనదియందు అభంగముల గ్రం

థము దేహూగ్రామవాసులకు దొరకెను. గ్రామ
వాసు లా గ్రంథమును తుకారామున కర్పింప,
మరణించిన బాలుఁడు సజీవుఁడైనప్పుడు తల్లికెట్టి
యానంద మనుభవమునకు వచ్చునో, అదేవిధ
ముగ, అభంగములు తిరిగిలభింపగనే తుకారా
ముఁడు మితిలేని యానందానుభవమున భావో
న్మత్తుఁడై, ఆడుచు పాడుచు ఎనిమిది యభంగ
ములను రచించి విఠోబాదేవున కర్పించెను

అభంగముల గ్రంథము ఇంద్రాణియందు పడ
వేయవలయునని తుకారామున కాజ్ఞయొసంగి
రామేశ్వరభట్టు నాగనాథమను సుప్రసిద్ధశివలింగ
మును బూజింపవలయునను సంకల్పమున శిష్య
గణపరివేష్టితుఁడై బయలువెడలెను. పథమధ్య
మునం దొకానొక ముసలమాన్ ఫకీరుని యుద్యా
నవనములోని జలాశయమున స్నాన మొనర్చు
చుండెను. అప్పుడు ఈయన తనయొక్క పూర్వో
త్తరసందర్భముల నెఱుగు ఫకీరునకు సరియగుజవాబు

చెప్పక మీఁదు మిక్కిలి యవమానజనకము గు భాషను బ్రయోగించినందువలన క్రోధాన్వితుఁ డగు ఫకీరతనిని తిట్టెను. అందువలన స్నానానంత రము రామేశ్వరభట్టుని శరీరము మంటలెత్త సాగ నట. శరీర వేదన సహింపఁజాలని రామేశ్వరభట్టును ఫకీరుయొక్క శరణుఁ జొరుమని శిష్యులనిరి కాని, ముసలమాను ఫకీరునకు శరణార్థి యగుట కంగీకరింపక జ్ఞానేశ్వరుని సమాధియొద్ద కేగి రక్షింప వేఁడుకొనుచుండెను. ఇట్లుండ రామేశ్వ రభట్టునకొకనాఁడుజ్ఞానేశ్వరుఁడుస్వప్నమునందుఁ బ్రత్యక్షమై యిట్లనియెను. "భగవద్భక్తుఁడగు తుకారాముని కష్టపెట్టుటవలన నీకీగతి పట్టినది. కావున నీవాయనశరణుఁ జొరుము" అనును పువ్వు లాలించి మేల్కాని తుకారాముని అభంగములు తిరుగ లభించిన వృత్తాంతమును శిష్యులవలన విని, స్వయంకృతాపరాధమునకు లజ్జితుఁడై తుకారాముని స్తుతించుచు తన శరీరాస్వస్థతను దెలుపు కొనుచు ఒక లేఖను వ్రాసి తుకారాముని కడ

కంపెను. రామేశ్వరభట్టు తనకు మితిలేని అప
కార మొనర్చినను మహాభక్తుఁడగు తుకారామున
కాయనపై అణుమాత్రమైనను కోపము లేదనుట
నిశ్చయము. తుకారామాలేఖను జదువుకొని
ఆయన దుర్దశకు వగచి ఈక్రింది యభిప్రాయము
గల అభంగమును ప్రత్యుత్తరము క్రింద పంపిం
చెను. "హృదయము నిర్మలమైన యెడల శత్రు
వులు హృదయ సమానులగుదురు. కావున సర్వ
భూతసమత్వముగలిగి విఠోబాదేవునిశరణుఁజొచ్చి
మనుము." ఈయభిప్రాయముగల అభంగమును
చదువుకొనినంతటనే రామేశ్వరభట్టుయొక్క శరీ
రతాపము చల్లారెనని మహీపతి వ్రాయుచున్నాఁ
డు. శరీరతాపము చల్లారినంతటనే రామే
శ్వరభట్టు తుకారామునిజూచుటకు బయ
లుదేరెను. ఈవార్త విని తుకారాముఁ డెదు
రేగి మార్గమధ్యమునందు రామేశ్వరభట్టును గల
సికొని వందనం బాచరించెను. రామేశ్వరభట్టుని
జనుర్వ్యవహారమునకుఁ బరితాపము నొందుచుఁ

ప్రేమాపూర్వకముగ తాము బాధించిన అభంగ మును జదువుకొనుటవలన నాశరీరతాపము చల్లా రుటయేగాక జ్ఞానోదయమయిన దనియు, ఇప్పటి నుండియు మీశిష్యవర్గమునఁ జేరి మిమ్ము విడ నాడక దిరుగుచుందుననియు నుడువుచు, విద్యాభి మానము, కులగౌరవము, సాంసారిక ప్రతిష్ఠయం దలి మోహ పాశములను దెగఁ ద్రెంచుకొని తుకారాముని నాశ్రయించి హరినామామృత మును గ్రోలుచుండెను.

ఇదేవిధముగ ననేకుల వలన తుకారాముఁ డనేక కష్టము లొందవలసిన వాఁడయ్యెను. ఈ యన శిష్యులలో కంచరపని చేయువాఁ డొక డుండెను. వాని పేరు శివాజి. అత్యంత సం సారాసక్తుఁడగు శివాజి ప్రప్రథమమున తుకారా మునిపై ద్వేషము కలిగియుండి తుదకు తుకారా ముని ధర్మోపదేశశ్రవణమువలన మనోపరివర్తనుఁ డయ్యెను. ఇందువలన శివాజి సంసార ధర్మము

లను విడనాడి రేయింబవళులు తుకారాముని వెన్నంటి దిరుగుచు, సాధుసజ్జన సేవకు తన సర్వస్వము నర్పించుచుండెను. దీనిని జూచి శివాజి భార్య సహింపఁజాలక, తనభర్త చెడి దిరుగుటకు కారకుఁడగు తుకారామునిఁ గడతేర్పవలయునని సంకల్పించుకొని తనయింటికి ఆయనను భోజనమునకుఁ బిలచెను. స్నానమునకు శరీరము బొబ్బలెక్కునంతటి వేడినీళ్ళిచ్చి విషమిశ్రితపదార్థములఁగుడువఁ బెట్టెను. భగవానుని యనుగ్రహము వలన విషమిశ్రితపదార్థము లీయనకు ప్రమాదమును గలిగింపఁజాలకున్నను వేడినీళ్ళస్నానము వలన శరీరము బొబ్బలెక్కెను. తుకారాముఁడీ దురవస్థను విఠోబాపాదములపైఁ బడి విన్నవించుకొనెనేగాని శివాజి భార్యపైని యణుమాత్రమైనం గోపమును జెందఁడయ్యెను. ఒకటిరెండు దినములలో తుకారాముఁడు స్వస్థతను జెందెను. కాని ధూర్తురాలగు శివాజిభార్య యీాయనవిషయమున నిట్టి ఘోరకార్యము లొనర్చుటవలన

కుష్ఠురోగగ్రస్తురా లయ్యెననియు తుకారాముని కరుణవలన కుష్ఠురోగమునుండి ముక్తినొందెనని యు, మహీపతి వ్రాయుచున్నాఁడు.

ఇంత దనుక తుకారాముని సహిష్ణుతను గూర్చివర్ణించి యున్నాము. ఈయన యాత్మసం యమమునుగుఱించి మహీపతి మఱియొక దృష్టాం తమును జూపియున్నాఁడు. ఒకానొకసమయము నందొకస్త్రీ తనపాపాభిలాషను తుకారామునకుఁ దెలిపికొనెను. కాని ఈయన ఆస్త్రీనిమాతృ సంబోధనముఁజేసి పిలచుటవలన ఆస్త్రీ లజ్జితయై అంతటనుండియు సన్మార్గగామియయ్యెను. తుకా రాముఁడు ఈమెను మాతృభావమునఁ జూడఁ గలుగుటకు ఆత్మసంయమమేకదా కారణము! ఇట్టి యాత్మసంయమముగల మహాపురుషులనే మృతజీవులందురు.



## ఏడవ ప్రకరణము



భక్తులభావములయం దెల్లప్పుడు నీశ్వరప్రకాశమును జూచుచుండఁగలము. శిశువుచేయుప్రత్యేకకార్యములయందెల్ల తల్లి ప్రకాశించుచుండువిధముననే భక్తునియొక్క సమస్తకార్యములయందును పరమేశ్వరుఁడు ప్రకాశించుచుండును. భక్తుని ప్రయత్నము లెప్పుడును వ్యర్థములు గావు. ఈశ్వరుఁడు భక్తులపిలుపునకు పలుకుచుండును భక్తుల యాశయములను పూర్ణమొనర్చును. భక్తుల ఆకాంక్షలను చరితార్థత నొందించుచుండును. ఈశ్వరుఁడు తనంతటతానే భక్తులహృదయాంతరాళములయం దధిష్ఠించియుండును. ఇందువలన భక్తునిముఖద్వారమున ఈశ్వరుని సౌందర్యమును జూడఁగలము. భక్తుని వాణిగుండా ఈశ్వరవాణిని వినఁగలము. భక్తుని యంగమునుండి ఈశ్వరుని ప్రేమాసౌరభము నాఘ్రాణింపఁ గలుగు

దుము. స్పర్శమణియగు భగవానుని స్పర్శనము వలన భక్తుని కబ్బు శక్తికి మేర లేదు కదా! భక్తుఁడు హృదయాంతరాళమునందు పరమేశ్వరుని ధారణ చేసికొని అనుక్షణమును భగవంతునితో కేళి సల్పుచుండుటవలన అనాయాసముగ, కష్టములను, మరణమును తుచ్ఛముగ చూడఁగలుగుచున్నాఁడు. మహారాజాధిరాజుల శిరముల నలంకరించు మణిమయమకుటములను ధూళితో సమముగఁ జూచి పదతాడనము చేయఁగల శక్తి మహాభక్తునకుఁ గాక మఱెవ్వరికిఁ గలదు ?

మహారాష్ట్రజాతీయనిర్మాణకర్తలగు తుకారామును, రామదాస స్వామియు, శివాజియు, పరస్పర సంబంధముఁ గలిగి మహారాష్ట్రజాతీయాంతర్గతమగు భక్తిజ్ఞానకర్మలను ప్రబోధింపఁజేసి అఖండ మహారాష్ట్ర సామ్రాజ్యమును స్థాపింపఁ గలిగిరి. ఈముగ్గురిలో తుకా

రామునకును శివాజికిని గల సంబంధమును వర్ణించుటవలన వీరి ధర్మాభిలాషయు వైరాగ్య శీలతయు వెల్లడి కాఁగలవు. శివాజియొక్క పరాక్రమమును గూర్చియు, బుద్ధిచాతుర్యమును గూర్చియు, కార్యనిర్వహణాదక్షతను గూర్చియు, తఱుచుగ వినుచుందుము గాని ఈయన ధర్మానురాగమును గూర్చి మనకంతగాఁ దెలియదు. ఈయన ధర్మానురాగమును జూచినచో రాజు గాక సన్న్యాసియైనను, శాశ్వతముగ జాతీయ చిత్రపటమునందు చిత్రింపఁబడి యుండునని మనము సుస్పష్టముగ దెలిసికొనఁ గలము.

కడుబాల్యము నుండియు తల్లియగు జిజీబాయివలన పురాణములలోని కథలను వినుచుండుట చేత శివాజీ హృదయమునందు స్వదేశాభిమానమును స్వధర్మనిరతియును, దట్టముగ నాటుకొని యుండెను. ఇందువలన స్వధర్మరక్షణార్థము స్వరాజ్యస్థాపనమే మార్గమని యెంచి తుకారా

ముని భక్తివలనను, రామదాసస్వామి జ్ఞానము వలనను, ప్రబోధింపఁ బడుచున్న మహారాష్ట్రులకు కార్యనిర్వహణదీక్ష నొసఁగి అఖండ మహారాష్ట్ర సామ్రాజ్యమును స్థాపించెను. శివాజీకి సంరక్షకుఁడుగ నుండి ఆయన భావికాలోన్నతి కనుగుణమగు శిక్ష నొసంగుచుండిన వారిలో ముఖ్యుఁడగు *దాదాజీ కొండదేవుఁడు "స్వరాజ్యస్థాపనా వ్రతము సంపన్నము గావలయునని"యెడల సాధు పురుషుల దీవనలొందుట

---

* ఒకప్పుడు తుకారాముని మతమునకు వ్యతిరేకముగ ఇద్దఱు బ్రాహ్మణ బ్రహ్మచారులు ఈయనయొద్ద అభియోగమును దెచ్చిరి. ఈవిచారణయందు దాదాజీకొండదేవుఁడు తుకారామును స్వపక్షమును సమర్థింపుకొను మని నుడివెను. తుకారాముఁడు భక్తిరసామృతమును గురించు అభంగముల ద్వారా తనపక్షమును సమర్థించుకొనుటం జూచి బ్రహ్మచారుల ధర్మభావము మారిపోయెను. దాదాజీకొండదేవుఁడు తుకారాముని సన్మానించి నింద్యు లగు బ్రహ్మచారులకు శిక్ష విధించెను. కాని తుకారాముని అనురోధమువలన దాదాజీ కొండదేవుఁడు బ్రహ్మచారులను వదలివేసెను.

యు వారియుపదేశముల వినుచుండుటయు అత్యా
వశ్యకము" అని శివాజికి చెప్పుచుండెడివాడు.
ఆ నుడువులను శివాజీ కలలోనైనను మఱువక
సాధుసజ్జనసాంగత్యముచేయుచు వారియుపదేశ
ములను శిరసావహించుచుండెను. భక్తశిఖామ
ణియగు తుకారామునికీర్తిని వినినకొలదిని ఆ
యన దర్శనవాంఛ శివాజికి మిక్కుటమగుచుం
డెను. కావున నొకనాడు.తుకారాముడు లోహ
గ్రామమునకు వచ్చియుండెనను వార్తనాలించి
ఛత్రచామరగజాశ్వములతోడ నాతనిదర్శనార్థము
వచ్చుటకు తనముఖ్యోద్యోగి నొక్కనిం బంపెను.
ధర్మానురాగియు స్వజాతివత్సలుడును నగు శివా
జని మెచ్చి తుకారాముడు కర్ణాకర్ణిగ వినుచుం
డెనేగాని చూచుట తటస్థింపదయ్యె. కాని తుకా
రాముడు బహుజనాకీర్ణమును, మహదైశ్వర్యసం
పన్నమును నగు శివాజీ మహారాజుసభ కేగుట
కిచ్ఛింపకుండాయెను. "చంద్రకిరణములకు చకో
రములపగిది తమదర్శనమునకు శివాజీమహారాజు

నిరీక్షించుచున్నాఁడు. దర్శనమిచ్చి తనను తనపరివారమును ధన్యులుగ నొనర్పవలయునని గోరుచున్నాఁడు" అను శివాజీముఖ్యోద్యోగియొక్క వాక్యములవిని తుకారాముఁడు విషమసంధియందుఁ దగులొ్కనెను. ఒకవైపున ధర్మానురాగియగు రాజపుత్రుని యాహ్వానము రాజసభకేగవలయునని హృదయము నాకర్షించుచుండెను. రెండవవైపున రాజసభకేగినచో ఉపాయనములను స్వీకరింపవలసి వచ్చునేమోయను భీతి నిరుత్సాహపఱచు చుండెను.

ఇందువలన నీసందర్భమునం దీయభిప్రాయముగల అభంగముల మూలకముగాఁ దనమానసికావస్థను విఠోబాదేవునకు నివేదించుకొనియెను. "ప్రభో! ఇటువంటి వానినెప్పుడు నినుఁగోరను గదా! నాథా! నన్నేల కష్టములయందుఁ బడవైచెదవు? ఎల్లప్పుడు సంసారమునకు దూరమందుండుటకే నినుగోరుచుందును. మానవుల సాం

గత్యము చేయవలయునను ఆసయే దూరముగా నున్నది. విజనవిపినమధ్యమునం దానందముతో సంచరించుచుండుటయే నాకు మహానందదాయకము. ఓనాథా! ఛత్రచామరములును, గజాశ్వములును, దివిటీలును, పుణ్యపథగమనమునకు సహకారులు కావుగదా! ఓపండరినాథా! నాకిటువంటి బంధనము లేల తగిలించుచున్నావు. ఐశ్వర్యమును, సన్మానమును, దంభమును, శూకర పురీష సమముగ జూచుచుందును. కావున నన్నీ విపత్తునుండి యుద్ధరింపుము.'' ఇట్లు తనమానసికావస్థను విఠోబాదేవునకు నివేదించుకొని స్థిరచిత్తుండై శివాజీయొక్క ధర్మాభిలాషను గొనియాడుచు, ధర్మమునందాసక్తిని బురిగొల్పుచు రాజుయొక్క కర్తవ్యములను బేర్కొనుచు, నాల్గు అభంగములను రచించి ఆయుద్యోగస్థునిచేతికిచ్చి శివాజీకడకంపెను. తుకారాముడు పంపించిన అభంగములను శివాజీ చదువుకొని పరమానందభరితుండై ఆయనను సందర్శించుటకుగాను లోహగ్రా

మమునకు వచ్చెను. శివాజీమహారాజు తుకారా
ముని కడకేగి సాష్టాంగదండ ప్రణామంబొనర్చి
పుష్పహారములచే మెడనలంకరించి స్వర్ణముద్రల
కలశమును పాదములకడనిడి గ్రహింపుడని వేడు
కొనఁజొచ్చెను. ఆబంగారు నాణెములపాత్ర వంక
నైనను జూడక తుకారాముఁడిట్లనియె "రాజ
పుత్రా! హరిపదపద్మము లాశ్రయించి మనువా
రల దృష్టికి అణుపరిమాణములగు పిపీలికములును
రాజాధిరాజులును సమానులు. నాకుపాయనము
గ నొసంగిన ఈసువర్ణముద్రలకును మృత్తికకును
పార్థక్యము లేదని తెలిసికొనియున్నాను. హరిభ
క్తులు హరిపదములాశ్రయించి ఆశామోహము
ములకు లొంగకుండుటను నేర్చుకొనియున్నారు.
కావున హరిభక్తులకు సర్వస్వమును విఠోబాదే
వుఁడే యగుటవలన నాతని అనుగ్రహమువలన
వారలు త్రిభువనైశ్వర్యముల కధికారులైయు
న్నారు. ఆయన భక్తులకు తల్లియుఁ దండ్రియు
నై బలమొసంగుచుండుటచేత వారలు అసమాన

బలవంతులనుట నిక్కువము. సమగ్రవైకుంఠ
ము భక్తులగృహమైయున్నది. విఠోబా యను
గ్రహమువలన భక్తులప్రభుత్వము సర్వత్ర స్థాపిం
పఁబడియున్నది. ధనము, ప్రతాపము, వీర్యము
కలవానికి రాజపదము ప్రాప్తించును. విఠోబా
దేవుని యనుగ్రహమువలన భక్తులీమగాఁడు లక్ష
ణములు కలిగి రాజాధిరాజులకంటె శ్రేష్ఠులై
యున్నారు. కావున ఇట్టిభక్తులఁ బరితృప్తిపఱుప
వలయునను ఇచ్ఛ మీకున్నయెడల హరినామ
స్మరణఁజేయుచు తులసిమాలలధరించి ఏకాదశీ
వ్రతము నాచరించుచు హరిదాసుఁడవు గమ్ము.
ఇట్లొనర్చిన యెడల భక్తులు తృప్తినొందు
దురు."

మహారాష్ట్ర సామ్రాజ్య స్థాపకుఁడగు శివా
జీమహారాజు వంగి చేతులుజోడించుకొని స్వర్ణ
ముద్రల కలశమును గైకొనుఁడని తుకారాముని
ప్రార్థించునప్పుడు తుకారాముఁ డాకలశమును

ప్రేరేగంటనైనఁ జూడక మహాభక్తులకుఁగల సర్వభూతసమదర్శిత్వమును బోధించి హరిపదము లాశ్రయించి మను మను దృశ్యము కవివరేణ్యుని లేఖినివలనను చిత్రకారునికుంచెచేతను అమరత్వమునొందుట కర్హముగదా!

తుకారాముని ఉపదేశ శ్రవణమువలన శివాజీమహారుపలుకక యీయనకు ఉపాయన మర్పింపఁదలఁచితీసికొని వచ్చిన ధనకనకవస్తువాహనము లన్నిటిని బ్రాహ్మణులకొసఁగిసంకీర్తన వినుటకుఁగాను మఱికొకదిన మా గ్రామమునందుండెను. ప్రతిరాత్రియు శిష్యవర్గముతోఁ గూడి తుకారాముఁడు సంకీర్తనఁ జేయుచుండెడివాఁడు. సంకీర్తనా సమయమున భక్తవరుల ముఖవినిస్సృత ఝూంకారములు విశ్వవీణను మీటుచుండును. ఆ యనిర్వాచ్యమృదుమధుర ప్రేమానినాదము శ్రోతల మంత్రముగ్ధులుగ నొనర్చి యానంద సాగరమున కాకర్షించుచుండును. ఆయానంద

సారమం దోలలాడుటయే గదా మానవజన్మము యొక్క సాఫల్యము.

సంకీర్తనా సమయమునం దుచ్చైచ్ఛస్వరమున “హరి హరి” యని ప్రాణనాథునిబిలచు తుకారాముని జూచి, శివాజీ విస్మితుం డయ్యెను. సమ్ముఖముందున్న రాకుమారుని పిపీలికముతో బోల్చుట కణుమాత్రమైనను జంకని తుకారాముని మానసిక వికాసమును చూచి శివాజి హృదయము మారిపోయి అక్షౌహిణీ సైన్య పరివృతుండగు రారాజు పదమునకంటె మహాభక్తుండగు తుకారాముని వైరాగ్యపద ముత్కృష్టమైనదని ఈయన నిశ్చయించుకొని, నిర్జన స్థానమున కేగి ధర్మసాధనయందు జీవిత శేషమును గడుప వలయునని సంకల్పించుకొనెను. సంకీర్తన ముగియంగనే మంగళహారతిని దర్శించి తుకారామునకు నమస్కరించి ఛత్రచామరములు మొదలగు రాజోచిత చిహ్నములను పరిత్యజించి, ఏనెప

మున నెవ్వరును దన్ను సమీపింపఁ గూడదని ఉద్యోగస్థుల కాజ్ఞ యొసంగి, శివాజీ లోహ గ్రామ సమీపమందున్న నిర్జనారణ్యమున కేగెను. ఇట్లు పవలెల్లను నిర్జనప్రకృతిసహవాసమునఁ గాలము గడుపుచు, రాత్రులు సంకీర్తనా సమయమునకు లోహగ్రామములోనికి వచ్చి సంకీర్తనను వినుచుండెను. ఈవిధముగ కొన్ని దినములు గడచునప్పటికి శివాజీ యుద్యోగస్థులు భయపడి యీయన ప్రవర్తనను రాజమాతకుఁ దెలియఁబఱచిరి.

పిడుగువంటి యీవార్తను విని నంతటనే జిజీబాయి శోకాకులచిత్తయై లోహగ్రామమునకు వచ్చి శివాజీ విరాగమునకు, తుకారాముని యుపదేశములే కారణమని గ్రహించి, ఆయనను శరణుఁ జొచ్చి. " ఓ భక్తవరా! నాపుత్రుఁ డొక్కఁడు. సన్న్యాస మవలంబించిన నేనెటులు సహించి మనఁగలను? మావంశము నెవరుద్ధరింతురు? ఈ రాజ్యమును రక్షించువా రెవ్వరు?

ఓనాథపుంగవా! ఈవృద్ధురాలియం దనుగ్రహ
ముంచి పుత్రభిక్ష పెట్టుము" అని నుడువుచు
పాదముల పైఁబడి కన్నీరు కాల్వలై పార నేడ్చు
చున్న రాజమాతను లేవదీసి కూర్చుండఁ బెట్టి
అభయ మిచ్చి శాంత వచనములతోడ తుకా
రాముఁడు "మాతా! శివాజీ సంకీర్తనా సమయ
మున కిక్కడకు వచ్చును. కావున సేనాయనను
సముపదేశములవలన తిరిగి సంసారము నందుఁ
బ్రవేశ పెట్టుదును. కాఁబట్టి మీరు నిశ్చింతతో
విఠోబాదేవునిపై నిర్భరపడి హరినామస్మరణఁ
జేయుచుండుఁడు" అని చెప్పెను. ఆ మాట
లాలించి రాజమాత విఠోబా నామమును స్మరిం
చుచు దుఃఖమును వీడి పుత్రునికొఱకై యెదురు
చూచుచుండఁగా ఆ రాత్రి సంకీర్తనా స్థలమునకు
శివాజి వచ్చెను. తుకారాముఁడు శివాజీని జూచి
సంసార సముద్రము దాటుటకు సత్కర్మయే
నావ. స్వధర్మ పరిపాలనముకంటె పరిత్రాణకు
వేఱు మార్గము లేదని శాస్త్రము లుద్ఘోషించు

చున్నవి" అని నుడువుచు, ప్రథమమున బ్రాహ్మణధర్మములను బోధించి తదుపరి క్షత్రియధర్మములను బోధించుట కుపక్రమించి యిట్లనియెను. "సమ్ముఖమందున్న యుద్ధమున శత్రువులను జయించుటయు, ప్రజాపాలనమును క్షత్రియుల ధర్మములు. సుఖాభిలాషియగు వ్యక్తి నిజావయవపరిపుష్టిని జూచికొని తృప్తి నొందు విధమునసే, రాజులు సముదాయ ప్రజాసౌఖ్యమును జూచి యానందము నొందుచుండవలయును. సదసద్వివేకములతోఁ గూడుకొని ప్రజాపాలన మొనర్చుటకంటె క్షత్రియులకు మహత్తర ధర్మ మింకొకటి లేదు. క్షత్రియులు సత్యనిష్ఠ గలిగి ప్రజాసుఖమే తమ సుఖముగ భావించి సర్వభూత దయఁ గలిగి సర్వకాల సర్వావస్థలయందు హరినామ స్మరణఁ జేయుచు భగవత్కరుణకుఁ బాత్రులై మనవలయును. కావున నిట్టివారి విషయమునం దరణ్యావాసము ప్రయోజనకారి కాదు. కనుక వీరికి భగవానుఁడు స్వయముగ

బుద్ధిప్రాభవమున శివాజీ పట్టుబడక తప్పించుకొనెను. ఇందువలన శివాజీ మహారాజుయొక్క ధర్మాసక్తియు, ఈశ్వరభక్తియు, తుకారాముని సంకీర్తనాశక్తియు వెల్లడి కాఁగలవు.



# ఎనిమిదవ ప్రకరణము.

—ంంశ్రీంం—

చిరకాలమునుండియు భారతవర్షమునందుతీర్థ మాత్రాస్థానములు ధర్మమహాసభలై యున్నవి. ఈసభలయందు భారతవర్షీయవిభిన్న ధర్మసాంప్రదాయిలు తమతమ ధర్మమార్గములలోని నూతనావిష్కార తత్త్వములను ప్రదర్శించుచుండిరి. ఈధర్మప్రదర్శనములు భారతీయులధారావాహిక సార్వజనిక దృష్టిని అపరిచ్ఛిన్నమునుండి పరిచ్ఛిన్నమునకును పరిచ్ఛిన్నమునుండి యపరిచ్ఛిన్నమునకును జూపుచు భారతీయుల జాతీయధర్మభావముల యొక్క క్రమోన్నతిని దెలుపుచుండును. కొందరు మహాపురుషులీధర్మవిప్లవములను భూతభవిష్యద్వర్తమానకాలములయందు సమన్వయించి సమన్వయ సిద్ధాంతములను వెలిబుచ్చుచుండిరి. కొందరు పరిచ్ఛిన్నముతోఁగూడిన తమసాంప్ర

దాయికధర్మభావమునందే అపరిచ్ఛిన్నమును జూపుచుండిరి. ఇట్లు సాంప్రదాయికధార్మికులందఱు పరస్పరసాహాయ్యమువలన నూతన వికాసమును బొందుచు, జాతీయతాధర్మశక్తిని విజృంభింపఁ జేయుచుండిరి. ఇట్టి పుణ్యక్షేత్రములలో నేటికిని పవిత్రతమముగ పరిగణింపఁబడుచు హిందువుల యొక్క క్రమోన్నతిని దెలుపుచు భారతజాతీయధర్మభావమునకు కేంద్రస్థానమనఁ జెల్లునది వారాణసిపురము. వైష్ణవులు శైవులు మొదలగు వారలకు వేర్వేఱు పుణ్యక్షేత్రములు కూడఁ గలవు. అట్టివానిలో పండరిపురము మహారాష్ట్ర దేశీయ వైష్ణవులకు పరమపవిత్రస్థలము.

పండరిపురనాథుని యుత్సవమునకు వేలకొలఁది భక్తులు సమావేశమగుచుండిరి. ఒకానొకసమావేశమునందు ప్రఖ్యాతికెక్కిన జ్ఞానియు, భక్తుఁడును, శివాజీమహారాజునకు దీక్షాగురువును అగు రామదాసస్వామియు, తుకారామును బరస్పర దర్శనమువలన ధన్యులైరి. ఈ యుత్సవమునందు

సమావేశమైన భక్తులెవరి పంథానుసారముగ
వారు సంకీర్తనను జేయుట కుపక్రమించిరి. తు
కారాముఁడు తనయభ్యాసానుసారముగ భక్తుల
తోఁగలసి సంకీర్తనఁ జేయుచు హరికథలు చెప్పు
చుండెను. ఒకదినమున భక్తులందఱు తుకారా
ముని సంకీర్తనమునందు జేరి పరమప్రీతినొంది మ
ఱునటిదినసంకీర్తనాభారమును రామదాసస్వా
మిపై నిడిరి. మఱునటిదినము భక్తులయాజ్ఞప్ర
కారము రామదాసస్వామి ప్రాముఖ్యతను వ
హించి సంకీర్తనను నడపెను. ఇట్లు భక్తులంద
ఱును గలసి కొన్నిదినములు సంకీర్తనఁ జేయు
చుండ శ్రీకృష్ణాష్టమివచ్చెను. ఈదినమున భక్తుల
యాహ్లాదమునకు మేర లేదయ్యె.

భక్తులందఱు ఉషఃకాలముననే స్నానమాడి
తిలకములఁ దీర్చి తులసిమాలల ధరించి పరస్పర
గాఢాలింగనములొనర్చుకొనుచు పెద్దలకు వం
దనములర్పించుచు, "హరేకృష్ణా" అని హరినా
మస్మరణఁ జేయునప్పుడు వేలకొలఁది స్త్రీపురుషు

లక్షోఁగూడిన యుత్సవరంగమంతయు కృష్ణనా
మమునఁ బ్రతిధ్వనించుచుండెను. పాదముల గజ్జె
లుకట్టుకొని తంబురమీటుచుఁ జిటికెలవాయిం
చుచు హరినామమును బాడుచు నృత్యము జేయు
చుండు భక్తవరుల వీక్షింపఁ బ్రేక్షకుల హృద
యములు తాండవమాడుచుండెను. మృదుమ
ధురవచోగుంభనల భక్తిరసములొలుకు హరి
కథల నాలించినకొలందిని ప్రేక్షకు లున్మత్తులై
విరామము లేక హరినామము నుచ్చరించుచుండిరి.
శ్రీమన్మహాభాగవతములోని శ్రీకృష్ణజననమును
జరుగునప్పుడు సందర్భానుసారముగ భక్తులక
న్నీరు మున్నీరై పారఁ జూపరుల హృదయక్షేత్ర
ములయందు భక్తిరసము వెల్లువలై ప్రవహించుచుం
డెను. గోపికల వేషములను ధరించి విరహగీతము
లఁ బాడుచు కోలాటము వేయుచుండు భక్తవరు
లనుజూచినకొలఁదిని చూపరు లానంద పరవశులై
ప్రేమగీతములఁ బాడుచు చేతులఁదట్టుచు నాడు
చుండిరి. కొందఱుభక్తులు ''శ్రీకృష్ణుఁడవతరించె

ను" అని కేకలిడుచు అఱచుచు పరుగిడుచు త్రో
వకడ్డమైన వారిని కౌఁగిలించుకొని "శ్రీకృష్ణుఁడు
దయించెను కుశలముగ బృందావనముఁ జేరెను"
అని నుడువుచు చెట్టుపుట్టలకుఁగూడ నీసువార్త
ను జెప్పుచుండిరి. ఒకభక్తుఁడు భీకరాకారమును
దాల్చి మనచిన్నికృష్ణుఁడు శకటాసురుని సంహ
రించెననియును ఇంకొకఁడు మనగోపాలకృష్ణుఁడు
పూతననుఁ బరిమార్చెననియును వేఱొకఁడు మన
బాలగోపాలుఁడు ధేనుకాసురుని వధించెననియును
శ్రీకృష్ణుని విజయవార్తలను జాటునప్పు డంద
ఱేకగ్రీవముగ మనగోపాలకృష్ణుఁడు బలరాము
నిఁగూడి మధురాపురమున కేగి రజకుని హత
మొనర్చి కంసునివధించెను, అనియఱచుచు
"కృష్ణా, కృష్ణా" యని భూమికంపింప నృత్య
ముఁ జేయుచుండిరి. తుకారాముఁడు భక్తుల
వంకఁ జూచి భీష్మద్రోణాశ్వత్థామకర్ణశల్యాదు
ర్యోధనభీమసేనులతోఁ బ్రకాశించుచున్న కురు
పాండవ వాహినీమధ్యమునందు ధవళాశ్వముల

వర్గంబులచేఁ బూని నొగలపైనుండి గిరగిర త్రిప్పి గుఱ్ఱములనదలించు చేకోలనాపి పాండవ మధ్యమునకు భగవద్గీతావాగమృతంబు వర్షింపఁ జేసి దివ్యదృష్టినొసంగి విశ్వరూపమునుజూపించెనని యుచ్చైస్స్వరమున నఱచి చెప్పినప్పుడు భక్తులెల్లరు శ్రీకృష్ణునివిశ్వరూపంబును సందర్శించి జయజయనినాదములు చేసిరి. ఆబాలగోపాలము ఆనందలహరింబడి మైమఱచి ప్రేమసింధువునందు సంగమించుచుండిరి.

భక్తులెల్లరు మైమఱచి యున్మత్తులై అఱచుచు గంతులు వేయుచుఁ, బరుగిడుచు, నవ్వుచు, అవ్యక్తముగ మాట్లాడుచు, భౌతిక దేహంబులమఱచి పరమేశ్వరాయత్తచిత్తులై నారదాది దివ్యమునులంగలసి పుణ్యతీర్థంబులం దిలకించుచు, బృందావనమార్గంబున నిర్గమించుచుండిరి. ఇట్లు శ్రీకృష్ణుని సందర్శనార్థంబరుగుచు, నిర్మల క్షీరదసలిలజలకల్లోలకలకలస్వనములతోడ మత్త

కాసినింబోలె మందగామియగు యమునానదీతట
తరుచ్ఛాయల నొంటికాలిపై బరువూని, రెండవ
కాలిబొటనవ్రేలు భూమిపై నానించి మెడను నా
డింపుచు, గంభీరనీలగగనంబుపైఁ బోవుపయో
ధరంబుభంగి మోముపై ముంగురులుజీరాడ
వేణుగానంబుచే మానవజాతినంతయు నాకర్షించి
ఆడించుచున్న జగన్మోహనమూర్తియగు శ్రీకృ
ష్ణుని చిఱునవ్వును నిబిడాంధకారబంధురంబగు
నిశీధివేళ మెఱయు మెఱుపువలె సందర్శించెను.
కాని వారికన్నులకరువుతీరు టెట్లు? చేఁజిక్కిన
మణి జారిపోయినటులఁ బరితపించుచుండ ఆల
మందలలోని యంభారవములను విని యులికి
పడి పకపక నవ్వుచు గొల్లవ్రేల బృందావన
మునుసందర్శించి, శ్రీకృష్ణా! శ్రీకృష్ణా! యని పిలు
చుచు, ఆలమందలమధ్య నృత్యముఁ జేయుచు
మురళీనాదముచే నైంద్రజాలకునివలె భక్తు
లెల్లరిచే నృత్యముఁ జేయింపుచున్న వేణుగానలో
లుని మృదుమధుర వేణుగానస్వనము చెవులసోకి

నంతనే వెఱ్ఱులై పనిపాటలుమాని పసిపాపలప్పిడి
తండ్రోపతండములుగ పాఱివచ్చి గోపికాబృంద
మునంగలసి బాలగోపాలుని దరిఁజేరి వేణూస్వర
మున స్వరసమ్మేళనమొనర్చి జడకోలాటము వేయు
చు, "ప్రాణనాథ బిరానబ్రోవవే" అనిపాడుచు
మధురభావమునందోలలాడి మహాభావమునందు
నిమగ్నులైరి.

భక్తుల యున్మాదమునకు మేర లేదు. వారి
చర్యలు భావనాతీతములు. వారి రాజ్యము మన
రాజ్యము గాదు. ప్రేమరసమును చవిఁజూచిన
వారలే వారి యున్మాదమును దెలిసికొనఁ గలరు;
వారి చర్యల కానందింపఁ గలరు. వానిని నాబోంట్లు
యొక్క లేఖిని యెట్లు వర్ణింపగలుగును? అయి
నను ఒక్కటిమాత్రము చెప్పఁగలను. ఆదినమున
భక్తులెల్లరు చెట్లు పుట్టలు, ఇండ్లు వాకిండ్లు, మ
నుష్యులు మృగములనుభేదమును మఱచి యే
చెట్టును జూచినను, యేపుట్టను జూచినను, యేమ్మ

గమును జూచినను, యేమనుష్యునిఁ జూచినను, విశ్వపతినే సందర్శించిరి. నమస్కరించిరి. ప్రసంగించిరి. సేవఁజేసిరి. రారాయని నోటినిండఁ బిలచి స్నేహము నెఱపిరి. ఆడుకొనిరి. ఆలింగన మొనర్చిరి. ముద్దిడుకొనిరి. కొంతవడి కోపతాపముల జూపిరి. తిరిగి గాఢాలింగన మొనర్చుకొనిరి. ప్రాణనాథుని దర్శన స్పర్శనములవలనఁ దన్మయత్వము నొందిరి. పిమ్మట భక్తు లనుకరించునది మహాభావము. దానిని నేనెట్లు చెప్పగలను? అది యనిర్వాచ్యము. అవాఙ్మానఁ సగోచరము. కావున వ్రాయుటెట్లు? అనుభవించియే గ్రహింపవలయును.

ఈదినము రాత్రి భక్తులు భాగవతము నాడిరి. ఇందు కొందఱు కృష్ణుఁడు, బలరాముఁడు, నందుఁడు, యశోద మొదలగు వేషములను ధరించిరి. మన తుకారాము గోపికావేషమును ధరించెను. గోపికావేషమును ధరించి నృత్యాభినయములతోఁడ

భావోన్మత్తుఁడై యున్న ఈయన ముఖవినిస్సృత యభంగములు శ్రోతలఁ దన్మయత్వము నొందిం చుచుండెను. ప్రఖ్యాతి కెక్కిన మహాభక్తులందఱు బాలకులవలె నృత్యగీతాభినయములతోడ, ప్రేమ రసమును గ్రోలి తమ తమ స్థానముల కేగిరి. ఎల్లరు తుకారాముని జీవన్ముక్తుఁడని తలంప సాగిరి.

రామదాసస్వామి "రామాయతీ" పంథావ లంబకుఁడగు సన్యాసి. ఈయన బ్రాహ్మణవంశ సం భూతుఁడును, మహా విద్వాంసుఁడును, శివాజీ మహారాజునకు దీక్షాగురువునై యుండెను. ఈ యన ప్రథమావస్థయం దొకింత స్వపంథాను రాగమును గలిగియుండుట వలన నీయన శ్రీరామచంద్ర విగ్రహమునకుఁ గాక మఱియే విగ్రహమునకును నమస్కరింపఁడయ్యె. కాని యీయన పండరిపురమున భక్త సమావేశము నందు కలసినప్పటినుండియు చిత్తపరివర్తనుఁడై పండరిపురనాథుని దర్శించి యిట్లనియె.

"మనోమోహనశ్యామసుందరమూర్తియగు శ్రీరామా? చాపమును బాణములను పరిత్యజించి యీ యిటుక పీఠముపైని శయనించినావా?" అని నుడివి నమస్కరించి పండరిపురము నుండి వెడలునప్పుడు "సమస్తస్థలములు పరమేశ్వరుని శక్తితోఁ బరిపూర్ణములై యున్నవి. కనుక నేనే తీర్థముల కేగుదును" అని నుడివెనని యును, తుకారాముని సాంగత్యమువలననే యీయన చిత్తపరివర్తనుఁ డయ్యెననియును జెప్పుదురు.

ఇంకొకపరి యేకాదశీ యుత్సవ సందర్భమున తుకారాముఁడును రామదాసస్వామియు శివాజి యుఁ గలిసికొనిరి. ఆయుత్సవమునకు వచ్చిన భక్తమండలిని శివాజీమహారాజు సత్కరించి వారికి తగు సదుపాయము లొనర్చెను. ఆయుత్సవమునకు అనేక మంది సన్యాసులు వచ్చి యుండిరి. రామదాసస్వామి శిష్యురాలగు "అకాబాయి"

అను సన్యాసిని రామదాసస్వామి విరచితమగు "దాసబోధ" అను గ్రంథమును శ్రావ్యముగఁ జదివి వినుపించెను. శివాజీ మహారాజు "పాకొ గడము" అను పేరుగల గిరిదుర్గమునందు శ్రీరామ చంద్రమూర్తి దేవళముఁ గట్టించి ప్రాణప్రతిష్ఠో త్సవమునకు, భక్తులు జ్ఞానులు సంగీతపాటకులు విద్వాంసులు మొదలగువారి నెల్లర నాహ్వానిం చెను. ఉత్సవమునకు వచ్చిన వాండ్రలో రామ దాసస్వామి శిష్యురాండ్రగు అకాబాయియు, వేణూబాయియు, స్వయముగ సంకీర్తనమును జేసి భక్తిరసామృతమును ప్రవహింపఁజేసిరి. అనేక మంది సంగీతపాటకు లొకటిగాఁ గూడి సం కీర్తనను సలిపిరి. కాని భావోన్మత్తుఁడగు తుకా రాముని యసదృశ సంకీర్తనము శ్రోతల నంత్ర ముగ్ధులుగ నొనర్చుటవలన నొకమాసమువఱకు తుకారాముని సంకీర్తనము ప్రతిదినమును జరుగు చునే యుండెను. ఉత్సవాంతమున ఛత్రపతి శివాజీ మహారాజు బ్రాహ్మణులను భక్తులను

సన్న్యాసులను జ్ఞానులను ధనకనకవస్తువాహన ములతోఁడఁ బూజించి తుకారాముని బూజించు టకు గాను స్వర్ణముద్రలను సిద్ధపఱచి నాలుగు గ్రామము లర్పింపనెంచి యుండెను. కాని తుకా రాముఁ డీసడిని గ్రహించి యెరికిఁ దెలియకుండ పలాయనుఁ డయ్యెను. ఇందువలన శివాజీ మితి లేని పరితాపమును బొంది తన పరితాపమును రామదాసస్వామికి నివేదించుకొనెను. ఈసంద ర్భమునందు శివాజీకి రామదాసస్వామి "త్రైలో క్యసంపదలను గూడ ధార్మికులు తుచ్ఛముగఁ జూచు చుందురు. విఠోబాభజనా నిరతుఁడగు తుకారాముఁడు చతుర్విధ ముక్తులనే సామాన్య ముగఁ దలచునప్పు డీ యైహిక సంపదలయం దా యన గౌరవమును జూపునా" అని చెప్పెను.

ఆషాఢ కార్తీక మాసములలో పండరిపుర మున జరుగు యేకాదశీ యుత్సవములకు తుకా రాముఁడు తప్పక పోవుచుండెడి వాఁడు. ఒకమారు

శరీరాస్వస్థత వలన మంచమునుండి దిగఁజాలక
విఠోబా దర్శనమున కేగఁ గల శక్తి లేదు గదా
యని పరితపించుచుండెను. ఇట్లుండ నొక యేకా
దశికి భక్తులు భజనఁ జేసికొనుచు రాజమార్గ
మున పండరిపురమున కేగుచుండు తఱి మృదంగ
తాళముల శబ్దములను విని మంచము మీఁదఁ
బడియున్న తుకారాముఁడు చివ్వున లేచి రాజ
మార్గములోనికి పడుచు తూలుచు వచ్చి భక్తుల
తోడ, నావాక్యములుగ విఠోబా దేవునితో నిట్లు
విన్నవింపుఁడని పలుకం దొడంగెను. "విఠోబా
దేవుని యెదుట నేనేమి యపరాధ మొనర్చితిని?
ఏకారణమువలన విఠోబాదేవుఁడు తన దర్శనము
నుండి నన్ను వంచించెను. నాయందనుగ్రహించి
కొంచెము బల మొసంగినచో పండరిపురమునకు
పరుగిడుచు వచ్చి విఠోబాదేవునిఁ గన్నులార సం
దర్శించి భక్తులతోడ గలసి నృత్యముఁ జేయు
దును" అని నుడువుచు నిరువది నాల్గభంగ
ములు గల యుత్తరమును విఠోబాదేవునకు నమ

ర్పించుమని యిచ్చెను. ఆ యభంగములలో నాలు గభంగముల సారమీ క్రింద నుదహరించుచు న్నాను.

"నన్ను చూచుటకు మీకిష్టము లేనియెడల నన్నేల పుట్టించితిరి? నా లేములకొఱకు నే నెవరి ముఖము వంకఁ జూచుచుందును? నాకష్టములను విని నన్ను పరామర్శించియాదరించు వారెవ్వరు? ఓదేవా! నీవు నన్ను పరిత్యజించినచో నేనెవరి శరణుఁ జొత్తును? నన్నెవ రాదరించి దగ్గఱకుఁ బిలతురు? నాకష్టము లెవరు తెలిసికొందురు? సంకటములనుండి నన్నుద్ధరించు వారెవ్వరు? ఓపాండురంగా! నా మనోభావముల నీవే తెలిసికొనఁ గలుగుదువు."

"నిన్ను చూడవలయునను కోరిక నాహృదయమును దల్లడిల్లఁ జేయుచున్నది. కాని యది పూర్ణముగానందువలన నామన మస్థిరమైయున్నది. నా మనము మంగలమునఁ బెట్టి వేచు

చున్నట్లున్నది. నే నేపాపమును జేయుట వలన నాకన్నులు నీమూర్తిని చూడఁజాలకున్నవి? నా కపాల లిఖితమును గూర్చి యేమనియెదవు? ఎందువలన నాపాదములు పండరి పుర మార్గమున నడచుట లేదు? ఎందువలన నా మస్తకము నీచరణము లానుట లేదు? ఎందువలన నీకు నమస్కరించి నాహస్తములు ధన్యత నొందుట లేదు? ఎందువలన నాజిహ్వ నీకీర్తిని గానము చేసి పవిత్రత నొందుట లేదు? ఓ ప్రభో! ఎప్పుడు నీమహాద్వారమునఁ బడి సాష్టాంగదండ ప్రణామం బాచరింతును?

"అనేక దినములనుండి నీ వాక్యములనే నమ్మి యున్నాను. కాని ఓ పాండురంగా! నాపై నుదాసీనభావముఁ జూపుచున్నావేల? నాపై నింత కాఠిన్యమును జూపుట న్యాయమా? నన్ను మఱచితివా? ఓ గోవిందా! నీవెట్టి గురుతర కార్యమునందు మునిఁగియున్నావు? నీ సంతానము వృద్ధి యగుటవలన నన్ను త్యజించితివో!'

"నేనుధనికునియింటజన్మించి నిర్ధనుఁడనైతిని. జగత్తునం దీకథతోఁబాటు నీకీర్తి వ్యాపించినది. ఇప్పుడు నన్నెవ్వరు కలియుటలేదు. నీయాహ్వానము రాలేదు. ఇట్టి స్థితియందు నాజీవనము కేవలము తుచ్ఛముగదా! నేను నీదర్శనాభిలాషతోఁ గంఠగతప్రాణుఁడనై యున్నాను. నామనసు నీచరణ సన్నిధానమునకుఁ బరుఁగిడుచున్నది. నీదర్శనోత్కంఠత నన్ను ధైర్యచ్యుతినిగ నొనర్చుచున్నది. హేపాండురంగా! ఏవిధముగ ధైర్యచిత్తుఁడ నగుదును? ఏల నావాక్యములను పెడచెవినిఁ బెట్టుచున్నావు? ఇట్టిస్థితియం దేమిచేయుటకర్తవ్యమో దెలిసికొనఁజాలకున్నాను."

భక్తులు తుకారాముని యాజ్ఞవడసి పండరిపురమున కేగుమార్గమున నిర్గమించుచుండిరి. విఠోబా దర్శనవాంఛ మిక్కుటమగుటవలన తుకారాముఁడు నిలుపఁజాలక భక్తులవెంటఁబడి నడచుట కుపక్రమించెను. గ్రామమును దాటి

దాటక పూర్వమె తుకారాముఁడు నడువఁజాలక పడిపోయెను. పడిపోయిన తుకారాముని గృహమునందుం జేర్చి భక్తులు పండరిపురమేగి యీయనపంపించిన యిరువదినాలు గభంగములను విఠోబా దేవునకుఁజదివి వినిపించిరి. తిరిగి శిష్యుల వలన నుత్సవ వివరములు విని తుకారాముఁ డానందభరితుఁ డయ్యెను.

సాధారణ ప్రజలు తుకారాముని అలౌకిక భక్తిసంపన్నుఁడని యెంచి యీయన శిష్యవర్గమునఁ జేరుచుండిరి. కడు దూరదేశములనుండి గూడ రోగములు పోవునను దలంపున రోగార్తులును, పుత్రులుకావలయునను దలంపున పుత్రహీనులును వచ్చి తుకారాముని శరణుజొచ్చుచుండిరి. వైరాగ్య పరిపూర్ణుఁడగు తుకారాముని అభంగములు పశువుల కాపరులు మొదలు రాజాధిరాజుల వఱకును బాడుచు ఆత్మోన్నతి నొందుచుండిరి. రేయింబవలను భేదములేక ప్రజ

లు గుంపులుగుంపులుగ వచ్చి తన్నుఁజుట్టికొనితమ కష్టములను విన్నవించుకొనుచుండుటవలన విరాగమునఁ గాలము గడుపనెంచియున్న తుకారామునకు మనస్సంకటము మిక్కుటమై "ఓప్రభో! ఆలస్యము చేయుటేల? నన్ను వైకుంఠమునకుఁ దీసికొనిపొమ్ము" అని కేకలువైచుచుండెడి వాఁడు. అనవరతవ్రతములు ఉపవాసములు జాగరణ మొదలగు వానివలన నీయన శరీరము క్రమక్రమముగ క్షీణింపఁజొచ్చెను. భక్తబృందము సమావేశమైనంతటనే యున్మత్తుఁడై సంకీర్తనను ప్రారంభించి నూతన అభంగములను జెప్పుటవలన మానసిక శ్రమ మిక్కుటమయ్యెను. శక్తితఱిగిన కొలఁదిని తన ప్రవాసకాలము పూర్తియైనదని గ్రహించి యున్నస్థలమునందుండక "నేను వైకుంఠమునకేగుచున్నాను." అని యప్పుడప్పుడు నుడువుచుండెడివాఁడు.

లోహగ్రామవాసులు తుకారాముని విడచి యుండఁజాలక పలుమారు తమగ్రామమునకుఁ

దీసికొనివెళ్లుచుండిరి. వీరి ధర్మాభిలాష కానందము
ను బొందుచు ఆహ్వానమువచ్చినంతటనే యీ
యన శిష్యజనపరివేష్టితుండై లోహగ్రామమున
కేగి సంకీర్తనను జేయుచుండెడివాఁడు. ఈయన
అభంగముల యందనేకములు లోహగ్రామవాసు
లను గూర్చి చెప్పినవై యున్నవి. తుకారాముఁడు
పరలోకగమనమునకు బూర్వమొకమాస మీగ్రా
మమందే యుండి సంకీర్తనను జేయు చుండెను.
అకాలమున మహారాష్ట్రదేశముయుద్ధములలో
దేలుచుండుటవలన నెచ్చటఁజూచినను దోపిడులు
నరహత్యలు మొదలగుఘోరకార్యములు నిత్య
కృత్యములై యుండెననుట యతిశయోక్తిగాదు.
తుకారాముఁడు నివసించియున్న కాలముననే లో
హగ్రామమును మహమ్మదీయులు కొల్లఁగొట్టిరి.
ఇందువలన ననేకవిధములగు కష్టనష్టములకుఁ బా
ల్పడి పరితాప మొందుచుండు వారినిజూచి యీ
యన యీవిధముగ నుడివెను. "నష్టమైనధనము
కొఱకు పరితపించుట ధర్మముగాదు. కలిగిననష్ట

మంతయు భగవద్విధానము వలననే సంభవించిన దని తలంపుఁడు. పోయినధనమంతయు భగవంతుని సేవకొఱకు వినియోగింపఁబడినదని తలఁచి దుఃఖమును మానుఁడు. సుఖదుఃఖముల కంతరాత్మస్థితుఁడగు భగవానుఁడే భోక్త. శరీరము నిప్పుల యందుఁబడి కాలునప్పుడా దుఃఖము నాతఁడే పొందుచున్నాఁడు. కావున దుఃఖము లెప్పుడు జీవునకుఁ జెందవు. అనాయాసముగ భగవానుఁడు లభ్యమగుచున్నప్పుడు ధనముపోయినను విచారమేల యుండవలయును?" ఈఘటనను ప్రత్యక్షముగఁ జూచుటవలన తుకారామునిస్వభావసిద్ధమగు కోమల హృదయము విచలితమయ్యెను. శత్రుహస్తచ్యుతమగు గ్రామముయొక్క దృశ్య మతిశోచనీయముగదా? భస్మావశేషమైన భవనములను, పాడైన సస్యక్షేత్రములను చూచునప్పుడును, తలిదండ్రుల నెడఁబాసిన బాలురయొక్కయు భర్తలఁ గోల్పోయిన భార్యలయొక్కయు భార్యలఁ గోల్పోయిన భర్తలయొక్కయు నార్తనాదములు వినునప్పు

డును ఎట్టి పాషాణహృదయములైనను బ్రద్ధలగు ననుట వింతగాదు. తుకారాముఁడీహృదయభేదకమగు దృశ్యమునుజూచి 'ఓప్రభో! మర్త్యలోకమునందు నివసింపవలయునను ఆశపూర్తియైనది. నన్నిఁక వైకుంఠమునకుఁ దీసికొనిపొమ్ము." అని విఠోబా దేవుని ప్రార్థింపఁజొచ్చెను. లోహగ్రామములోని మహాభక్తులలో కొందఱు తుకారాముని సాంగత్యమును విడనాడియుండఁజాలక ఈయనను వెంబడించి దేహూగ్రామమునకు వచ్చిరి. ఈయన దేహూగ్రామమునకు వచ్చిన తర్వాత శ్రీకృష్ణునియుత్సవము ప్రారంభమయ్యెను. సాధారణముగ నీయుత్సవమునందనహ్యాములైన కార్యములు జరుగుచుండుట యాచారమైయుండెను. కాని తుకారాముని నేతృత్వమువలనఁ బ్రేక్షకులెల్లరు నిర్మలభక్తిరసమునందోలలాడిరి. ఉత్సవసమాప్తి దినమునందు హాస్యాత్రము లభంగములు తుకారాముని

ముఖవినిసృతములగుచుండెను. ఈయభంగములు "కాయబ్రహ్మకరణీ" (కాయమును బ్రహ్మకర్పించుట) అనునామమునఁ బరగుచున్నవి. మంగళ హారతి సమయమునందీయన యుచ్చైస్స్వరమున హరినామమును సంస్మరించుచు నృత్యమును జేయుచు పాటలుపాడుచు "నేను వైకుంఠమున కేగుచున్నాను. రాఁదలఁచినచో ద్వరితముగరమ్ము" అనిశిష్యులచేత భార్యకు వర్తమానమంపి వైకుంఠగమనోత్సకుఁడై సంకీర్తనను జేయుచుండెను. ఇంతకు పూర్వము కొలఁది దినములనుండి తుకారాముఁడేతీర్థమున కేగుచున్నను, "నేనువైకుంఠమున కేగుచున్నానని" చెప్పుచుండుటవలన ఇపుడీయన యేదియో నూతనతీర్థయాత్ర కేగుచున్నాఁడని తలంచి జిజీబాయి యేవిధమగు పరితాపము నొందక "గర్భిణిగనున్న నేనేవిధముగ పిల్లలను వదలితమతో వత్తును?" అని ప్రత్యుత్తరమంపెను. ఈవార్తనందికొని పరివేష్టితులగు వారలఁజూచి తుకారాముఁడిట్లనియె. "అన్నలారా! నేను వై

కుంఠమున కేగుచున్నాను. ఇఁక తిరిగి మిమ్ముఁగలసి సంకీర్తనఁజేయఁ బోను. నేను వైకుంఠమున కేగుచున్నాను. వైకుంఠమున కేగుచున్నాను. హరి నామస్మరణయే సమస్తమానవులకు శరణ్యము. పాండురంగనాథుని శరణుజొచ్చి మనుఁడు. శిష్యులారా! నేనేఁగుచున్నాను. బంధుగులారా! నాకు సెలవు. స్నేహితులారా! సెలవు. నేనిప్పుడమర ధామమున కేగుచున్నాను. నా భార్య యిచ్చట నేయున్నది. ఆమెకు గృహకార్య నిర్వాహక చతురత లేదు. మృదుమధురముగ మాట్లాడఁ జాలదు. నే ననేకవిధముల నామెకు ఋణపడి యున్నాను. ఈ యిహలోకమునం దామెను మీరుగని పెట్టియుండుఁడు." అని చెప్పుచు సాష్టాంగదండప్రణామంబాచరించి పుట్టినింటికేగు జవ్వనిం బోలె చిఱునవ్వులొలయ విఠోబాదేవునకు నమస్కరించి సెలవుగైకొనుచున్నానని నుడువుచు సంకీర్తన జేయుచు ఉత్సవస్థలమునుండి బయలుదేఱి ౧౬౪౯ క్రీ॥ ఫాల్గున బహుళవిదియ ఉషఃకాల

మున ఇంద్రాణీనదీతటమును జేరెను. ఏదియో దుర్ఘటయాత్ర కేగుచున్నాఁడనియెంచి శిష్యులీ యత్నమును నివారింపఁ బ్రయత్నించిరిగాని యా ప్రయత్నములు నిష్ఫలములయ్యెను. ఇంద్రాణీనదీ తటమునుఁ జేరి భక్తులఁగలసి యుచ్చస్వరమున విఠోబాను బిలచుచు నృత్యముఁ జేయుచు మైమఱ చియుండుతఱి అంతిమప్రార్థనాసూచకముగ నొక యభంగము తుకారాముని ముఖవినిసృతమయ్యె ను. ఆయభంగరసామృతమును బానముచేసి బా హ్యావిషయజ్ఞానశూన్యులై భక్తులెల్లరు నృత్య ముచేయుచు గీతముల బాడుచుండుసమయమున మహాభక్తుఁడును మహారాష్ట్రజాతీ యోద్ధారకుఁ డునగు తుకారాముఁడనంత కాలసాక్షి యగు ఇంద్రాణీనదీ సలిలముల "జలసమాధి" నొనర్చి అనంతప్రేమసాగరమున విలీనుఁడయ్యెను. ప్రతి వత్సరమిప్పటికిని దేహూగ్రామమునందియన జ్ఞా పకార్థము ఫాల్గునబహుళవిదియ రోజున గొప్ప యుత్సవముజరుగుచున్నది. తుకారాముఁడు గర్భ

ణిగనున్న భార్యనుజూచి "నీగర్భమునందున్న పుత్త్రుఁడు మహాభక్తుఁడగును. కావున వానికి నారాయణుఁడని పేరుఁబెట్టుము" అని నుడివినటులనే తుకారాముని భవిష్యద్వాణి సఫలమయ్యెను. నారాయణుఁడు మహాభక్తిసంపన్నుఁడై యనేకయభంగములరచియించెను. ఆబాలగోపాల మాయభంగములిప్పటికిని మహారాష్ట్రదేశమునందు బాడుచుందురు. తుకారాము పరలోకయాత్రకేగిన యొకవత్సరమునకు శివాజీమహారాజు దేహూగ్రామమునకువచ్చి తుకారామునికుటుంబపోషణార్థ మొకగ్రామమును జాగీరుగనిచ్చెను. ఇప్పటికిని యీజాగీరును వారివంశస్థు లనుభవించుచున్నారు.

తుకారాముని పరలోకగమనమును గూర్చి మహీపతి యీవిధముగ వ్రాయుచున్నాఁడు. "ఇంద్రాణీనదీతటమునం దంతిమప్రార్థనా రూప మగు అభంగము తుకారాముని ముఖమిని

స్మృత మైనంతటనే దివ్యజ్యోతివలన పార్శ్వవ ర్తులకన్నులు మూతపడెను. కన్నులు దెఱచి చూచు నప్పటికి తుకారాము గన్పింపలేదు. స్వర్గమునుండి దేవగణమువచ్చి తుకారాముని విమానముపై నెక్కించుకొని వైకుంఠమునకు దీసికొనిపోవు చుండుటను భక్తులుమాత్రమే చూడఁగలిగిరి". ఇంకొక చరిత్రకారుఁ డీవిధముగ జరిగియుండవచ్చునని వ్రాయుచున్నాఁడు. "తుకారాముని అభంగములను వినుచు నెల్లరును బాహ్యజ్ఞానశూన్యులై యుండిరి. ఈసమయమున తుకారాముఁడింద్రాణీనదియందుదిగి 'జలసమాధి" నొందెను. జలసమాధినొందుట ఆకాలమునందు తఱుచుగ జరుగుచుండెను. వీతరాగుఁడగు తుకారామునివంటి మహాభక్తుఁడు జలసమాధినొందినాఁడనుట అసంభవముగాదు. ఏస్థానమున తుకారాముఁడంతర్ధానమయ్యెనని జనులిప్పటికినిఁ జెప్పుకొనుచుందురో ఆస్థానమతి గభీరమును మొసళ్లు మొదలగు జలచరములకాకరమునై

యున్నది. కావున జలములయొక్క గభీరతవలనఁ గాని జలచరములు భక్షించుటవలనఁగాని తుకారాముని శరీరము కనుపడకుండవచ్చును. ఇందువలన తుకారాముఁడు సశరీరముతోడ స్వర్గమున కేగినాఁడను ప్రవాదము పుట్టియుండును." ఈయన వ్రాసిన వ్రాతలు విశ్వాసపాత్రములుగనున్నవి. తుకారాముని వంశీకులిప్పటికిని ఆయన యభంగముల వ్రాతప్రతిని బూజించుచున్నారు. ఈ గ్రంథము చివర "౧౫౭౧ వ శకముఫాల్గున బహుళవిదియ ప్రాతఃకాలమున తుకారాముఁడు వైకుంఠమునకేగెను" అనివ్రాయఁబడియున్నది. కావుననే పవిధమగుయలౌకికఘటనలు లేని యీవాక్యములే విశ్వసింపఁదగియున్నవి.



# ఉపసంహారము.

—ooo—

తుకారాముని జీవితమనేక ఘటనలతోఁగూడి కౌతూహలజనకమును శిక్షాప్రదమునై యున్నది. సుఖదుఃఖములవలన మనుష్యునకెట్టి శిక్ష సమకూరునో అట్టిశిక్ష తుకారాముని జీవితమునందు సంపూర్ణాకారమును దాల్చెను. ఈయన సంపన్న గృహస్థునింట జన్మించి తలిదండ్రుల పరమాదరమునకుఁ బాత్రుఁడై సామాజికరీతి ననుసరించి తరుణవయస్సుననే సంసారమునందుదిగి కులపరంపరాగత వ్యాపారమునం దడుగిడిన కొద్దిదినములకే ధనార్జనానిపుణుఁడై సరివారిలోఁ బ్రశంసింపఁబడు చు తలిదండ్రుల వాత్సల్యమును భార్యయొక్క ప్రేమయు నవజాతపుత్రునియందుండు మోహమును ధనకాంక్షయు మొదలగు వానియందు దగుల్కొనెను. కాని రాజకుమారుఁడగు సర్వా

ర్థసిద్ధుని నేనుమహాశక్తి బిచ్చగానిగ నొనర్చెనో ఆమహాశక్తివలన తుకారాముఁడాకర్షింపఁబడెను. పృథివియందలి దుఃఖము హింస మొదలగువాని తొలఁగించి ప్రేమరాజ్యమును స్థాపించుటకేయ సను పరమేశ్వరుఁడు తనసైన్యాధిపతిగ నియమించుకొనెనాయని తోఁచుచున్నది. విశ్వరాజ్యమునందు మ్రోగుచున్న రణనినాదమీతని రణరంగమున కాకర్షించెను. రణరంగమువైపు పరుగిడిన కొలఁదిని యీయనబంధవిముక్తుఁడు కాఁజొచ్చెను. జ్యేష్ఠసోదరుఁడు సన్యసించుటయు, దలిదండ్రులు మరణించుటయు, వర్తకమునందు ధనమును గోల్పోవుటయే కాక దివాలాదీయుటయు, దీర్ఘవ్యాధివలన పీడింపఁబడుచున్న జ్యేష్ఠభార్య గతించుటయు సంభవించుటవలన నీయన మితిలేని యిక్కట్టులపాలయ్యెను. ఈశ్వరవిధానమునం దొకే కార్యమునం దొకరికి సంతసమును మఱియొకరికి దుఃఖమును గలుగుచుండునుగదా? సాధారణముగ తుకారాముఁడు పడినకష్టములయం దెవర

యినఁబడినచో నాస్తికతనే ప్రతిఫలముగఁ గైకొని యుందురని చెప్పినను జెప్పవచ్చును. తల్లిచే విడనాడఁబడిన శిశువు ధృఢముగఁ దల్లినే ధారణచేయువిధమున విశ్వజననివలన విడనాడఁబడినతుకారాముఁడు విశ్వజనననినే ధారణఁజేసి చరితార్థత నొందెను.

స్వర్ణకారుఁడు బంగారును పలువుటములయందుఁబెట్టి శుభ్రపఱచువిధముననే యీశ్వరుఁడు భక్తులయొక్క మనోమాలిన్యమును దూరముచేయఁగలందులకుఁగాను ప్రచండానల రాసితోఁ బోల్పఁదగినకష్టములయందుఁబడవేయుచుండును. అట్టిపరీక్షలకుఁ దాళినవారలే మహాభక్తులగుచున్నారు. తుకారాముని చరిత్రను దీర్ఘాగ్నిపరీక్షయని చెప్పనొప్పు. సంసారముయొక్క అసారత్వమును గ్రహించినకొలఁదిని యీయనను వైరాగ్యమావరించుచుండెను. వైరాగ్యమావరించినకొలఁదిని లోకులీయనను పిచ్చివాఁడనియు మూ

ఘుఁడనియు నిందింపసాగిరి. కాని వీనివలన తుకా
రాముఁడు చలింపకుండెను. ముండ్లమండతో దెబ్బ
లుతినుటయు, అభంగములను గోల్పోవుటయు
మొదలగు కష్టము లొకటివెంట నొకటి సంభవిం
చుచుండెను. ఈకష్టములకుఁదోడుగ గృహమునం
దణుమాత్రమైనను శాంతి లేకున్నను, ఈయన
చుపించుచు వచ్చిన * సహిష్ణుత యద్వితీయము.
తుకారామునికీర్తి వ్యాపించినకొలఁదిని ఈయన
దర్శనార్థము ప్రజలు గుంపులుగుంపులుగ రాసా
గిరి. మహారాష్ట్రదేశాధీశ్వరుఁడగు ఛత్రపతిశివాజీ

---

ఒకానొకప్పుడు పిల్లలకు గానుదీసికొనివచ్చిన చెఱకుగడ
లను తుకారాముఁడు బీదబాలురకు పంచిపెట్టుచుండుటను
జూచి జిజీబాయి చెఱకుగడ రెండుతుంటెము లగునట్లుగ
నీయన వీపుపూఁదగొట్టినదనియును వీతక్రోధుఁడగు తుకా
రాముఁడు భార్యవంకఁ దిరిగి "మనయిరువురకొఱకు నిక్షుదం
డమును రెండుచేసినావా" యని చెప్పెనని మహీపతివ్రాయు
చున్నాఁడు. ఈకథ సత్యమే యయినచో తుకారాముని
సహిష్ణుతము వర్ణనాతీతముగదా !

మహారాజు మొదలు కడుబీదస్త్రీలవఱకును తుకారాముని దర్శించుటకువచ్చి కానుకగ ధనరాసులను గ్రుమ్మరించుచుండిరి. కాని తుకారాముడు వీరిచ్చుధనమునువిషతుల్యముగఁదలఁచి పరిత్యజించుచుండెను. ఈసందర్భమునందీయన వీతరాగమును గూర్చి వేనోళ్ళఁ బొగడినను దీరదుగదా? ఈయన జీవితమునందు ప్రకాశించిన సహిష్ణుతము స్వార్థత్యాగము, అహేతుకభక్తి, జీవదయాపరత్వము మొదలగుసద్గుణములు మనుష్య మాత్రులకెల్లఱకు ననుకరణీయంబులనుటకు సందియంబు పనిలేదు.

బాహ్యధర్మములు దేశకాలపాత్రముల ననుకరించి మాఱుచుండ వచ్చును. కాని ఆంతరంగిక ధర్మములు మాఱుచుండవు. ప్రపంచమునందుండు వివిధ మతములయందును, వివిధ సాంప్రదాయములయందును సాధుపురుషులచరిత్రలయందును ఈఆంతరంగిక ధర్మములయొక్క యేకత్వము గానిపించుచుండును. తుకారాముని యాత్మోన్నతిని

జూచి యేదేశపు సాధుపుంగవులు సంతసింపరు? ఈయన స్వభావసిద్ధమగు సరళధారతో గవిత్వమును జెప్పఁగలిగియుండెను. భావమయమగు కవిత్వము సాత్వికభక్తి రసాస్వాదకమై యున్నది. మహారాష్ట్రజాతీయతయందు నిద్రాణంబైన భక్తితత్వమును ఈతఁడు మృదుమధుర కవిత్వముతోడ నుద్బోధింపఁజేసెను. "ప్రేమతోఁ గూడినభక్తియే యీశ్వరునిఁ బొందుటకు ముఖ్య సాధనము" అనితుకారాముఁడు చెప్పియున్నాఁడు. విశుద్ధచిత్తమున భగవంతుని పాదములపై నిర్భర పడి మనస్సును విషయవాసనలనుండి నివృత్తి నొందించి హరినామస్మరణను జేయుచుండుటయే ముక్తికి శ్రేష్ఠతరమగు మార్గము. బహుళాడంబరములతోఁగూడిన కర్మలవలన భక్తినశించుచుండుటకు వగచి సనాతనభక్తిధర్మమును పునరుద్ధరించుటకు తుకారాముఁడు ప్రయత్నించెను. ఈయన అభంగములన్నియు ఇహలోకసుఖముల క్షణికత్వమును దుర్మార్గులప్రకృతిని వారిదుర్బలత్వము

ను మొదలగువానిని నిరసించుచు సాత్వికభక్తిప్ర
బోధకములై యున్నవి. తుకారాముఁడు గృహ
స్థాశ్రమమందుండినను ఘోరాటవులయం దాకల
ములు దిని జీవించు వీతరాగులకంటె వీతరాగుఁడై
యుండెను. అహంకారము, ఈర్ష్య, దురభిమా
నముల నెఱుంగక తానితరులకుఁ జెప్పువిధమున
దానును బ్రవర్తించుచుండెను. తుకారాము
డనేక స్థలములయందు వేదోక్తధర్మము మీఁద
శ్రద్ధనుజూపించుటయే గాక వర్ణాశ్రమధర్మము
లను గుఱించి బోధించియున్నాఁడు. ఆత్మజ్ఞానసం
పన్నుఁడుఁగూడ స్వజాతికర్మను పరిత్యజింపఁగూడ
దని నుడివియున్నను, అహేతుకభక్తికిని హరిసం
కీర్తనకును సర్వోత్కృష్టస్థానమొసంగియుండుట
యేఁగాక భక్తితత్వమును బోధింపఁగలందులకు
గాను వైకుంఠమునుండి నేను వచ్చియున్నానని
యుఁ జెప్పియున్నాఁడు. ఈశ్వరకృపనొందుటకు
జాతిభేదములు మొదలగునవి ఆటంకములుగావని

యును, వైష్ణవుఁడేజాతివాఁడైనను మోక్షము నొందుట కర్హుఁడనియును భావోదయమగునంత వఱకు వర్ణాశ్రమధర్మములను పాలించుచుండుట కర్తవ్యమనియును నుడివియున్నాఁడు.

తుకారాముఁడు స్వభావసిద్ధముగ శాంతుఁడై యుండెను. అందువలన దుర్మార్గకార్యములను ఖండించుట కణుమాత్రమైనను వెనుకంజవేయకుండెను. జూదగాండ్రను, త్రాగుబోతులను, అబద్ధములు చెప్పువారిని వ్యభిచారులను సాధునిందకులను కన్యావిక్రయము మొదలగు పాపకార్యములను జేయువారిని బహు తీవ్రముగ నిందించియున్నాఁడు.

ఈయన నూతనధర్మమును స్థాపింపలేదుకాని, నూతనవిధమున సనాతనమతమును ప్రచారముఁ జేసియున్నాఁడు. సాధారణజనులు తెలిసికొనుటకు దుష్ప్రాప్యములగు విషయములెల్లరకును ప్రాప్యములుగ నొనర్చియున్నాఁడు. ఈయన యభంగములందీవిషయములు గన్పడుచుండును.

౧. సకలావస్థలయందును భగవంతునియందు భక్తిఁ గలిగియుండవలయును.

౨. తలిదండ్రులమీఁదవలె భగవానునిపై నిర్భరపడియుండవలయును.

౩. భక్తిమార్గముననే యీశ్వరుఁడు లభ్యమగును. బాహ్యానుష్ఠానములద్వారా యీశ్వరుఁడు లభ్యముగాఁడు.

౪. సచ్చరిత్రుఁడై, సర్వభూతదయఁగలిగి, భగవంతుని హృదయపీఠమునందధిష్ఠింపఁజేసికొనవలయును.

౫. సమస్తమానవులు భగవత్కృపకుఁ బాత్రులు. జాతినిబట్టిగాని వంశమునుబట్టిగాని భగవత్కృప కలుగనేరదు.

౬. ఈశ్వరునకును జీవులకును గలసంబంధము అతిమధురమైయున్నది. ఆయన మనకు దూరమందునివసించుటలేదు. వ్యాకులహృదయముతోడ నాయనను బిలచినయెడల సమస్తస్థలములయందా యనను చూడఁగలము.

తుకారాముఁడు ప్రేమతోఁగూడిన భర్తృఁడు, భార్యాపుత్రులకు మానాభిమానముల కీతని హృదయమునందు స్థానమే లేకుండెను. ఈయన తన హృదయమునం దెప్పుడును ప్రేమమయునే చూచుచుండెను. తల్లిసమీపమందు కొమారుఁడును, భర్తసాన్నిధ్యమందు భార్యయు, మిత్రునిసమీపమందు స్నేహితుఁడును, అవ్యాజప్రేమతోడ హృదయభావములను వెల్లడించు విధముననే తుకారాముఁడు ప్రాణనాథునకు తనకష్టసుఖములను విన్నవించుకొనుచుండెడివాఁడు. అభంగముల నింద్రాణీనదియందు పారవేయవలసివచ్చినప్పు డెవరితోడను మాట్లాడక విఠోబా దేవుని సమీపించి హృదయవేదనను విన్నవించుకొనెను. ఈయన విఠోబాదేవునితోడ సాక్షాద్భావమున మాట్లాడుచుండినటులు నీయన అభంగములను జదివినయెడలఁ దెలిసికొనవచ్చును. ఈయాత్మోపలబ్ధినేగదా జీవన్ముక్తియందురు. ఇందువలన నీ

యన యేయవస్థయందుండినను నిరంతరము దైవ వాణిని వినుచుండెడివాఁడనుట నిక్కువము.

ఆంధ్రదేశమునందు వలెనే మహారాష్ట్రదేశమునందును, ధర్మసాహిత్యమునుండియే జాతీయ సాహిత్య ముద్భవించినది. మహారాష్ట్రదేశీయ ధర్మసాహిత్యలేఖకులలోఁ దుకారాముఁ డగ్రగణ్యుఁడు. ఈయనవిరచితమగు పదునొకండువేల యభంగములు ముద్రితములై యున్నవి. మహాభక్తుఁడగు బమ్మెరపోతనామాత్యునకువలె సీయనకును భగవత్ప్రసాదమువలన కవిత్వధారయలవడెను. కొన్నిగ్రంథముల ఉచ్చమైనయాధ్యాత్మికభావములతోడ నింద్రియవికారోత్పాదకవిషయములు మిళితములై యున్నవి. కాని తుకారాముని కవిత్వమునం దిట్టిప్రమాదములులేక సుబోధకమగు లలితశైలితోడ భక్తిరసపూరితమై సునీతిపరిపోషకమై అలరారుచున్నది. ఈయన పదునొకండు వేల యభంగములేకాక ఈ క్రింద

చేర్కొనఁబడిన గ్రంథములనుగూడ రచించి యున్నాఁడు.

౧. భగవద్గీత పదునాఱవ అధ్యాయమునకు అనువాదము.

౨. నృసింహావతారచరిత్ర.

౩. ప్రహ్లాదచరిత్ర.

౪. వామనచరిత్ర.

౫. పరశురామచరిత్ర.

౬. శ్రీరామజన్మకథ.

౭. శ్రీరామచరిత్ర.

౮. శీతశోకము.

౯. శ్రీకృష్ణునిజన్మకథ.

౧౦. శ్రీకృష్ణునిచరిత్ర (బాల్యలీల).

౧౧. కల్క్యవతారము.

౧౨. కాలయవనవధ.

౧౩. రుక్మాంగదచరిత్ర.

౧౪. అంబరీషచరిత్ర.

౧౫. భానుదాసచరిత్ర.

సంపూర్ణము.



## గ్రంథకర్తలకును సంపాదకులకును వ్యయప్రయాసలు వలదు.

### అదేమి ?

చెన్నపట్టణమున చింతాద్రిపేటలో ఎచ్. వి. కృష్ణ అండు కంపెనీవారు గ్రంథములను దిద్దించి, అచ్చుచిత్తులను చూచి, పటములు మున్నగువానిని తయారుచేయించి, అచ్చువేయించి, అట్టకట్టించి, మఱియితరవిధముల పరిశ్రమచేసి బహుస్వల్ప కమీషనునకే గ్రంథకర్తలకు సాయము చేయుచున్నారు.

గ్రంథము [illegible] బరిశోధించుటకు ఆంగ్లేయాంధ్ర పండితుల నేర్పఱచియున్నారు.

వివరములం దెలిసికొనగోరువారీ క్రిందివిలాసమునకు వ్రాయవచ్చును.

మేనేజరు,

**ఎచ్. వి. కృష్ణ అండుకో**

చింతాద్రిపేట, మద్రాసు.